

# గృహలక్ష్మి

స్త్రీలసచిత్రమాసపత్రిక

సంపాదకుడు:

డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY

జూలై — 1948

సంపుటము ౧౭]



[సంచిక ౭




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయ సూచిక



శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవిగారు

కేసరీ కన్యావిద్యాలయ ప్రారంభోత్సవం జరిపారు.




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# స్త్రీలు — ఉద్యోగములు

స్త్రీ వస్తుతః గృహలక్ష్మి. గృహావరణం ఆమె కలంకారము; ఆమె గృహావరణానికి అలంకారం. అట్లా అని ఆమె ఇంటిలోనే ఖైదీగా పడిఉండాలని మేము కోరము.

సకల లౌకిక వ్యవహారాలలో ఆమె తగు శిక్షణలో తర్ఫీదై, పొందరానిదని, నిర్వహింపరానిదని—ఏ పబ్లిక్ ఉద్యోగమున్నూ లేదనీ, అట్లా మానవ కల్పితమైన నిషేధము ఉండరాదనీ, మా దృఢమైన అభిప్రాయము. కాబట్టి సాంఘికంగాగాని, రాజకీయంగాగాని, ఆమెకు తగిన సామర్థ్యం ఉన్నట్లైతే, ఎట్టి ఉన్నతోద్యోగాన్నైనా పొందడానికి ఆటంక ప్రాయాలైన నిషేధాలన్నీ తొలగిపోవాలి. సర్వసైన్యాధ్యక్షు పదవినైనా స్త్రీలు నిర్వహించడానికి అవకాశముండాలి. సహజంగా స్త్రీ అంటే పురుషునికుండే న్యూనతా భావమువల్లనే 1857లో నానాసాహెబ్ తమ్ముడు బాలారావు సర్వసైన్యాధ్యక్షు పదవిని ఝాన్సీ లక్ష్మీబాయి కివ్వక తానే వహించాడు. ఆ స్వాతంత్ర్య యుద్ధంలో మనము ఓడిపోవడానికి అదొక ముఖ్యకారణమని పాశ్చాత్య చరిత్రకారులే వ్రాసియున్నారు. ఈటెకు ఈటె, వ్రేటుకు వ్రేటు జబాబు చెప్పవలసిన ఆ రోజులలో ఝాన్సీవంటి వ్యక్తి లభ్యమైఉండగా, నేడు భౌతికశాస్త్రములనాశ్రయించి యుక్తితోను, రేడియోద్వారాను, నడిపేయుద్ధంలో అట్టి వ్యక్తులు అవకాశముంటే అవతరించకపోరు. కావున చట్టాలలో, ఆ చరణలో స్త్రీకి విషయమైగల న్యూనత తొలగాలి.

ఇది ఒక్క మన భారత దేశానికే సంబంధించిన సమస్యకాదు; ప్రపంచానికంతటికీ సంబంధించినది. యుద్ధాత్పూర్వం ఈ విషయంలో కొంత పరిశీలన జరిగింది,

అప్పుడు ప్రపంచంలోఉన్న ముఖ్యరాజ్యాలు 45లో 31 రాజ్యాలలో స్త్రీకి పురుషునితో పాటు సంపూర్ణమైన ఉద్యోగార్హత కలదు అని తేలినది. ఒక్క లక్సెంబర్గు రాజ్యంలోనే స్త్రీలకు ప్రభుత్వోద్యోగాలు చేయరాదని నిషేధముండేదట. అయితే కొన్ని దేశాలలో క్రింది ఉద్యోగాలు మాత్రమే స్త్రీల కిస్తున్నారు; ఒకే పనికి పురుషునికన్నా స్త్రీకి తక్కువ జీతం; వివాహానంతరం ఉద్యోగం చేయరాదని నిషేధం; పురుషులతోపాటు స్త్రీకిన్నీ త్వరత్వరగా ప్రమోషన్లు నివ్వరు. ఈ అపభ్రంశాలన్నీ, ఫాసిస్టు రాజ్యాలలోను, బ్రిటిష్ కామన్ వెల్తు రాజ్యాలలోను కన్పించుచున్నవి. ఈ విషయంలో కామన్ వెల్తు రాజ్యాలు తల్లిదేశమైన బ్రిటిష్‌దీవుల ననుకరిస్తున్నవి. అయితే ఆశ్చర్యకరమున్నూ ఆనందదాయకమున్నూ అయిన సంగతేమంటే చీనా జపాను రాజ్యాలలోమాత్రం స్త్రీ కీ న్యూనతలేదు; అక్కడ ఉభయులకూ సంపూర్ణావకాశమట.

భారతదేశంకూడా ప్రాగ్దేశాలకు నాయకమణిగా ఈ విషయంలో స్త్రీలకుగల సకల నిషేధాలను తొలగించి పూర్తిఅవకాశా లివ్వవలెనని భారతనారీలోకంయొక్క అభీష్టము. రాజకీయవేత్తలైన పెద్దలు కొందరు నేడు బ్రిటిష్ కామన్ వెల్తులోనే ఉండిపోవాలని ఉబలాటపడుతున్నారు. ఈ సందర్భంలోకూడా వారినే అనుసరింపక, చీనా జపానులవంటి సాటి ప్రాగ్దేశాల దారిన నడవడం న్యాయం.

అయితే, ఇప్పటివరకు భారతదేశం బ్రిటిష్‌దేశాన్నే అనుకరిస్తున్నదనవలె. ఈ సంవత్సరము మద్రాసు బడ్జట్ చర్చాసందర్భమున శ్రీ అమీరుద్దీన్ బీగంగారు ప్రభుత్వము అమలుజరుపుచున్న నిషేధాలను తీవ్రముగా విమర్శించి యున్నారు. కేంద్రంలోకూడా ఇది విమర్శనీయాంశమైనది.

ఇటీవల భారతయూనియన్ ప్రభుత్వమువారు ఇండియన్ అడ్మినిస్ట్రేషన్ సర్వీస్‌నకు దరఖాస్తు లంపమన్నారు. (ఈ సర్వీస్‌వారుఉన్నత ప్రభుత్వోద్యోగాలు వహిస్తారు.) అయితే స్త్రీలదరఖాస్తులు పట్టము—అని మొదట ప్రచురించారు. కాని తగువారు జోక్యము కలుగజేసుకోగా పునరాలోచించి, రాష్ట్ర ప్రభుత్వాల అభిప్రాయాలు కనుక్కొని, అధికసంఖ్యాక రాష్ట్రాభిప్రాయానుసారం స్త్రీలదరఖాస్తులున్నూ పట్టుటకు తీర్మానించారు. ఇందుకు వారిని మేమెంతైనా అభినందిస్తున్నాము. ఈ సందర్భంలో యూనియన్ మంత్రివర్గములోగల శ్రీమతి రాజకుమారి అమృతకౌరుగారి కృషి యెంతైనా తప్పకుండా ఉంటుంది. ఆమెయెడ భారతనారీలోకం నిరంతరం కృతజ్ఞత కలిగిఉంటుంది. ఇందు కేర్పడ్డ సర్వీస్ కమిషన్ వారున్నూ కేవలము దరఖాస్తులుపట్టడమే గాక, ఎట్టి న్యూనతయు పాటింపక అర్హులైన నారీమణులను తగుఉద్యోగాలలో నిల్పుదురు గాక యని కోరుచున్నాము.

ఈ విషయంలో భారతయూనియన్ వారు రాష్ట్రప్రభుత్వాల అభిప్రాయాలు కోరి నప్పుడు ఒక్క మన మద్రాసురాష్ట్రప్రభుత్వమే వ్యతిరేకాభిప్రాయాన్ని తెల్పిందట. ఇందుకు మనమెంతైనా సిగ్గుపడవలసియున్నది. మద్రాసురాష్ట్రం అనుశ్రుతంగా సాంఘికంగా రాజకీయంగా పూర్వాచారపరాయణమని, పేరుబడ్డదే. నేటి మంత్రివర్గం తమలో ఒక్కస్త్రీనైనా మంత్రిణిగా ఇముడ్చుకోజాలకపోయెనే యని నాడే మేము విమర్శించియున్నాము.

స్త్రీ ఇష్టపూర్తిగా, బాహ్యవ్యవహారముకన్నా, గృహనిర్వహణమే ఆనందదాయక మని వరించవలయునుగాని,—నిర్బంధించి వంటఇంట్లోకుక్కితే, శక్తిసంపన్నమైన ఆమె పైకిఉబికి వస్తుంది; అక్కడనే ఆమె నిర్బంధంగా పడిఉండేరోజులు గతించి చాలారోజు లైనాయి. నీతోకూడా జండాలుపుచ్చుకొని ఊరేగి, పికెటింగ్ చేసి, లాటీదెబ్బలను తిని, జైల్లో మగ్గి, ప్రజాప్రబోధంచేసి, స్వాతంత్ర్యం సాధించినఆమె_పెద్దచదువులు చదివి పరీక్ష లిచ్చినఆమె.—"ఇప్పుడు నే నధికారంచేస్తాను నీవు వంటఇంట్లోకిపో" అంటే వెళ్లుతుందా? ఆమెకై తోచి వెళ్లిన వెళ్లుగాక. ఈ విషయం మద్రాసు మంత్రివర్గములో నెరసినతలలు ఎంతత్వరగా గ్రహిస్తే అంతమంచిది. కావున ఎంతత్వరగా మనదేశంలో ఈ నిషేధాలు తొలిగితే, అంతగా మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినట్లవుతుంది.



## ఆశీస్సు

శ్రీ రమ్యాత్ముఁడు సద్గుణాకరుఁడు సుశ్రీయుక్తుఁడుద్యద్యశః
పారావారగభీరధీరుఁడును విద్వద్రాజ రాజన్యుఁడున్
ధీరాగ్రేసర కేసరాఖ్యుఁడునినున్ స్నేహంబుతో పెంప నా
శ్రీనారీమణి చందముండి గృహలక్ష్మీ! తల్లి వర్ధిల్లుమా.

నానాసూన నికాయ వాసనలచే నాణ్యంబైన పూదండల
న్నానందాన శిరాన బూని ముఖమున్ గాన్పించు కుంకంబుతో
నానావ్యాసము లెల్లరుం బనుప నానందంబు సంధించుచున్
శ్రీనారీమణి సేవితాంఘ్రి గృహలక్ష్మీ! తల్లివర్ధిల్లుమా!

పతిపాదాంబుజ పూజనాభిరతిచే ప్రఖ్యాతిగాంచిట్టియా
సతులెల్లన్ నినుజేరి గొల్వ యిలలో సత్కీర్తి పుంజంబులన్
సతతంబున్ వెదజల్లుచున్ నిలువుమీ సౌభాగ్య రేఖాప్రభా
స్మిత రాకేందు ముఖంబులోడ గృహలక్ష్మీ తల్లి వర్ధిల్లుమా!

మాలా రాజేశ్వరి.

# "అరణ్యరోదనం"

"శశి"

(పంకజం చక్కని పిల్ల 12 సం|| వయస్సు రొప్పుతూ పరుగు పరుగున వచ్చేసింది.)

"అమ్మా! అమ్మా! పలకవేమే, అమ్మా!

"అబ్బ ఏం అరుపులే-పాపలేస్తుంది-ఏంటా హడావిడి?

"అమ్మా! మరే పార్వతి వాళ్లనాన్న యినస్పెక్టరుగారు లేరూ? ఆయనకి ఉద్యోగం పోయిందని తెలిసిందిటే. పాపం వాళ్లమ్మ ఒకటే ఏడుస్తుంది."

"రెవిన్యూ యినస్పెక్టరుగారికా! పాపం. ఏం దురదృష్టమమ్మా - అనుకుంటూనే ఉన్నారు. ఆ పాపిష్టివాడు కక్షపట్టి ఏదో చేస్తాడని ఈ కాంగ్రెసు గవర్నమెంటు ఊరికే వచ్చిందా అమ్మా! ఎన్ని కాపరాలిట్లా కూలిపోయి పిల్లా జెల్లా అల్లాడాలో గదా? వెనకటి గౌరవమే లేకపోయె. ఉద్యోగస్థులన్నా ప్రభుత్వమన్నా ప్రతి ఆకతాయికీ అలుసేనయ్యె. ఏమౌతుంది?"

"ఎవరే అమ్మా పగబట్టింది లక్ష్మి వాళ్ల నాన్నేనా? ఆయనేంటో మెంబరటగా! ఎప్పుడూ పట్నం వెళ్లుతుంటాడే. ఏం చక్కటి కారు కొన్నారనుకున్నా? అందులో రేడియోకూడా ఉంది."

"ఆ మహాత్ముడే నమ్మా ఆ కుటుంబం ఉసురోసుకున్నాడు. యమ్.ఎల్.ఏ అట. నా పిండా కూడు. ప్రజల్ని ఘోషపెట్టించడానికి ఏదో పొలంతగాదాలో తను చెప్పినట్లు తప్పుడు వ్రాతలు రాశాడు గాదని, దొంగకేసు పెట్టించి వాళ్ల జీవనం తీశాడు. మంచిబుద్ధు లెట్లావస్తాయి? చదువా సంధ్యా? పరువా మర్యాదా? ఎప్పుడో పదిరోజులు జైలుకెళ్లి వచ్చాడని ఖద్దరు బురఖా వేసుకొని నాలుగురాళ్లు ఖర్చుపెట్టగానే గొప్పవాడైపోయాడు. మొన్నటిదాకా గోడ్లంట పోకిరీగా తిరిగిన వాడికి మంచి చెడ్డా వివక్షతేంవుంది. ఎంత తోస్తే అంత. ఉద్యోగస్థులు లంచ గొండులు; అన్యాయాలు చేస్తారని చెపుతూనే వాళ్లు లంచాలు పట్టకపోయినా, వాళ్ల బదులూ తన బదులు తనే తీసుకుని అడ్డమొచ్చిన వాళ్లకొంప లిట్లా కూలుస్తున్నాడు."

"అమ్మా వాళ్లమ్మాయి లక్ష్మి కూడానే? ఉద్యోగస్థులు లంచగొండులని ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని ఉడికిస్తుంది. దానిమీద కోపంవచ్చి కలెక్టరుగారమ్మాయి నారాయణి బాగానే అడిగిందిలే. ఉద్యోగస్థులు 20 యేళ్లు సంపాదించేదీ మీనాన్న ఏడాదికే సంపాదించేడుగా. లేందే, ఈ కారు, ఈ బియ్యంమర - శిల్కు బట్టలు అన్నీ ఆకాశాన్నుంచి పడుతున్నయి కాబోలు - అన్నదే. అప్పుడు చూడాలి! లక్ష్మి ఏడుపు మొహం పెట్టుకు మెదలకుండా వెళ్లిపోయింది. అమ్మా! మరి లక్ష్మివాళ్లు కాంగ్రెసు వాళ్లు గదా? వాళ్లనాన్న తప్ప యింట్లో యింకెవ్వరూ ఒక్క ఖద్దరు గుడ్డైనా వాడరే. అన్నీ కంట్రోలు గుడ్డలూ, శిల్కు గుడ్డలే. ఇవ్వాళ లక్ష్మి అయిదు గజాల చీర ఎం చక్కని అంచుది కట్టుకొచ్చిం దనుకున్నావ్. వాళ్ల పాపక్కూడ వాయిల్ గౌను మంచిది కుట్టించారు. అదీ కంట్రోలుదేనట. నాకూ అలాంటి చీర ఒక్కటి కొనవుటే అమ్మా!"

"ఎక్కడ తెమ్మంటావు తల్లీ! కడుపు కట్టుకునైనా, వీూముద్దు మురిపాలు చూసుకుందా మనుకుంటే, ఆ కంట్రోలు గుడ్డలన్నీ, 'అటు చీకటి బజారుల్లో కొనే మహారాజులికీ, యిటు అధికారాలు చేతుల్లో ఉన్న వాళ్లకేగాని-కడుపు కూటికే కరువనుభవించే బడిపంతులు కెవరిస్తారమ్మా? వాళ్లకంటే, కాంగ్రెసు వాళ్లు గనుక గ్రామ నౌకరు మొదలు మహామంత్రి వరకు వాళ్ల వాళ్లు గనుకా, ఏ గుడ్డ కట్టుకున్నా, ఏం చేసినా చెల్లుతుంది. మన-కెలా వస్తవీ, కబుర్లు చాలించి అన్నం తిను"

"అమ్మా యీఅన్నమేంటో వాసనగా ఉందే. నే తినలేను నా కొద్దే. పప్పూలేదు, నెయ్యీలేదు, కూరాలేదు, మజ్జిగాలేదు. వచ్చడితో ఎలాగేంటి తినేది? రోజూ యింతే నువ్వు"

(తల్లి కళ్లంట జల జల కన్నీరు)

"ఈ పాపిష్టిదాన్ని దేవుడు తీసుకుపోతే ఈ కష్టాలు కళ్లబడకపోనే నా తల్లీ! ఎదిగే పిల్లలు! ఈ దరిద్రపు రేషన్ కూడు తినలేక నరిగెలై పోతున్నారు. ఎవరికి వాళ్లే స్వలాభం చూసుకుని ఈ నాశనపు కంట్రోళ్లు తీసెయ్యకుండా నాటకమాడుతున్నారు. నా బిడ్డల ఉసురు తగిలి వీళ్ల అధికారా లెన్నడు నాశనమై పోతయో, కట్టుకోను గుడ్డా? కడుపునిండా కూడా? స్వరాజ్యంట, స్వరాజ్యం! జెండాలు పట్టుకు గంతు లెయ్యడానికీ. డబ్బున్న వాళ్లు బాగుపడ్డానికీ!"

"అబ్బ! ఏడవ్వాకే అమ్మా! నాకూ ఏడుపొస్తుంది. పోనీ నాన్నకూడ ఆ మెంబరు పని చేయించుకో గూడదూ? లక్ష్మీవాళ్లు చక్కటి సన్న బియ్యం తింటున్నారుగా? పైగా వాళ్ల బామ్మ వొడ్డి వాకిట బోలెడంత మందికి మంచి బియ్యం అమ్ముతుంది. పోనీ నువ్వక్కడన్నా కొని తెప్పించగూడదే అమ్మా!"

"పిచ్చి తల్లీ ఏ జన్మలోనో పెట్టి పుట్టేరు. అన్నీ సాగుతున్నాయి. మన కెందు కమ్ముతారు. పిచ్చి తల్లీ! కాంగ్రెసు గవర్నమెంటు! శుద్ధన్యాయం! ఏమీ అనరాదు! మనం దరిద్రులం. కూలివాళ్లు రోజు రెండూ మూడూ సంపాదిస్తారు. యింట్లో నలుగురుంటే ముగ్గురన్నా కూలికి వెడతారు. మీ నాన్న సంపాదన రోజుకు రూపాయి పావలా. మనం తినేది ఎనిమిదిమంది. ఆ బియ్యం రూపాయకు ఒక శేరు చొప్పున ఎలాకొంటాము? ఈ రోజుల్లో మన కంటే కూలివాళ్లు నయం తల్లీ-ఏం బ్రతుకో! ఎందుకు బ్రతకడమో? అయ్యో అదేమిటే - చెయ్యి కడిగేస్తున్నావు. నా పాపం పాడైపోనూ; ఆకలితో ఎట్లా నిద్రపోతావే. నాకు చావు రాకుండా వచ్చిందమ్మా!"

(మాస్టరు రామమూర్తి వాడినమొఖంతో నెమ్మదిగా యింట్లోకివస్తూ పైమాటలువింటాడు)

"ఏమిటే పంకజం? ఎందుకు అమ్మను విసిగిస్తున్నావు?"

"కాదునాన్నా ఈ వాసనకొట్టేఅన్నం, ఉత్తపచ్చడి, ఎలాతినేది నువ్వేచెప్పు? వద్దంటే అమ్మ ఊరికే ఏడుస్తుంది. రోజూయింతే"

(ఖిన్నుడైపోయి కాస్సేపు నిలబడి ధైర్యంతెచ్చుకుంటాడు)

పిచ్చిపిల్లా! అదేనాగోల? అందరితోపాటేనా మనమూను. ఎలాచెప్పమరి? కొన్నాళ్లుకష్టం, కొన్నాళ్లుసుఖం, ఈసారి మంచిబియ్యం వస్తవితే తినమ్మా! తిను!

(తల్లి అవ్యంగ్యంగా)

"తినమ్మా తిను! ఆ కాంగ్రెస్సంటే అలా అభిమానాలు పెట్టుకు పాకుల్లాడుతారు. చూచే నాథుడు లేడు. ఒక మినిష్టరుకో ఒక యమ్. యల్. ఏ కో ఈ ముప్ఫయిరూపాయల జీతమిచ్చి, ఈ రేషనింగు కూడు తినిపించి, ఈ చీలికలు వాళ్లపెండ్లాంపిల్లలచేకట్టిస్తే తెలుస్తుందిసంగతి. వాళ్లకార్లేమో - వాళ్ల విమానప్రయాణాలేమో - వాళ్ల సన్మానసౌఖ్యాలేమొ - పర్మిట్లవ్యాపారాలేమొ - మిల్లులనిర్మాణాలేమొగాని, సామాన్యప్రజ ఎలాచస్తున్నారన్నమాట లేదుగదా? పుగాకు వేరుశనగమాన్పించి, తిండిగింజలు ప్రత్తి పండించమని శాసనంచేస్తే ఈ ప్రజాఘోష ఉండదుగా. మన దుగ్ధపట్టలేక అనుకోడమేగాని, కంట్రోలు, పుగాకు, వేరుశనగలేకపోతే, ఈ ప్రభుత్వనాటకానికి కథేలేదు. పలుకుబడీ, సంపాదనా, మళ్లీ ఎలక్షన్లలో, మంత్రులుగానో, వాళ్లతాబేదార్లగానో వచ్చేమార్గం అన్నీ వాటిల్లోనేఉండె.

బ్రిటిష్ నిరంకుశత్వంపోయి కాంగ్రెసు నిరంకుశత్వం వచ్చింది. పైపెచ్చు, వచ్చిందేమంటే, దొంగవ్యాపారాన్ని ప్రోత్సహించడంవల్ల సామాన్యప్రజ మలమలమాడిపోవడం, మిల్లులువృద్ధికావడం మూలాన పాడిపంట ప్రజాసౌకర్యానికి వినియోగపడకుండా, రూపాయల మూటల వంకచూస్తూ రోగాల పాలై కృశించిచావడం"

(రామమూర్తి కొంచెంకోపంగా) లలితా! మరీ రానురాను ఈ కష్టాలవల్ల నీకు యుక్తాయుక్త విచక్షణకూడా లేకుండాపోతున్నదేం? నిన్నా మొన్నటివరకూ బాపూజీభక్తురాలివి! తీరాస్వరాజ్యం వచ్చేటప్పటి కిలాతయారయ్యావ్? మనకర్మానికితరులను దూషించడమెందుకు? తప్పు. పదవీవ్యామోహంలో కొట్టుకునిపోతూన్న వ్యక్తులతప్పుగాని యిది కాంగ్రెసు ఆదర్శలోపంకాదు. మహనీయులు, దురాత్ములు, అన్నిసంస్థల్లో ఉన్నారు మనంకొన్నాళ్లు కష్టంసహించి శాంతంగాఉండాలి. మనసౌకర్యాలకోసరం ప్రభుత్వాన్నిఅడిగి, నిరీక్షించాలిగాని త్వరపడి దూషించకూడదు. హోటళ్లప్రాబల్యంవల్లనే భావిప్రజకావలసిన బిడ్డలంతా పాలు, పెరుగు, నేయివంటి పోషకపదార్థాలకు కరువై రోగాల పాలవుతున్నారు. బ్లాక్‌మార్కెటువల్ల అన్నిరకాల ఉద్యోగస్థులూ అక్రమసంపాదనకు పూనుకుంటున్నారు. బంట్రోతువద్దనుండి మహామంత్రివరకూ, వ్యాపారస్థులకు లోబడడంమూలాన్ని మోతుబరిరైతు కూడా వ్యాపారసరళిగా వేరుశనగ, పుగాకులే, పండిస్తూ ఉన్నతిండిగింజలు దొంగమార్కెట్లో నాలుగింతలుగా అమ్ముతున్నాడు. అందరిదృష్టీ, రూపాయలలో కేంద్రీకరించడంచేత, ఏమాత్రం సంస్కరించినా గొప్పవారంతా నష్టాలపాలుకావలసి వస్తుందని, ఎవరంతట వాళ్లే తటస్థంగా ఊరుకుంటున్నారు. యుద్ధకాలంలోపెట్టిన అదనపుఆఫీసులూ, పుగాకు, వేరుశనగా, నిషేధిస్తే, కరువే మాయమవుతుంది. అంకెల మూలంగ చూపించే తిండికొరత లెక్కలన్నీ బూటకపు నటన - వ్యాపారస్థులు మధ్యరకంప్రజల్ని బలిచేయడానికి పన్నేవల. నిజంగా ఆహారానికి కొరతఎవరికి? డబ్బులేనివాడికి! ప్రభుత్వం యింకెపుడు కళ్లుతెరిచి ఈ తప్పుదిద్దుకుంటుందో". "ఆ దిద్దుకుంటారు! శాంతంగాచూడండి మహాప్రభూ. బిడ్డలఆకలిబాధ - బట్టలకరువుచూడలేక నాలాంటి కన్నకడుపులు దహించుకుపోయాక మీ ప్రభుత్వం శాంతంగా తప్పుదిద్దుకుంటారు. అప్పుడు లాభాలతో పొట్టలుపెంచినవారు, పదవులతో మదించినవారూకలిసి, స్ట్రైకులతోసాధించే; కూలిజనాల్తో ఘర్షణపడలేక, మళ్లా ఏమధ్యవర్తికో అధికారప్రదానం చేస్తారుచూడండి; ఈకన్నతల్లులకన్నీళ్లు, పసిబిడ్డలఉసురూ, రామరామ! ఈరాజ్యం ఎన్నాళ్లు నిలుస్తుందండీ? నాకెందుకుబాబూ. నాఅరణ్యరోదన ఎవరిక్కావాలి. అయుర్దాయమున్నవాళ్లు బ్రతికేదీ, ఆనక అందరితో పాటే చీకటిపడింది. ఈ ఘోషఎప్పుడూ ఉన్నదేగాని పాపనికాస్తపట్టుకోండి దీపంపెట్టివస్తాను.

# సినిమాలు—స్త్రీలు

భారతదేశం నేడు ఇంద్రజాలంనుండి బయటపడుసమయ మాసన్నమైనది. సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా, వైజ్ఞానికముగా, సర్వతోముఖముగా అభివృద్ధిపొంది, ప్రపంచ అగ్రరాజ్యములలో, అందును ముఖ్యముగా ఆసియాఖండమునకు తలమానికముగా నిరూపింప సర్వసన్నాహములు జరుగుచున్నవి. ఇట్టి భారతదేశము కన్నుతెరచి, ప్రపంచదృష్టిలో అగ్రస్థానము నలంకరించ తగుమార్పులను శరవేగముతో తీర్చి దిద్దుకుంటూవున్నది.

ఇట్టి స్థితిని ఏర్పర్చుటకు అన్ని దృక్పథములలోని అగ్రగణ్యులు నిరంతరము ప్రణాళికలు తయారుచేసి ఆచరణ యోగ్యమొనరించుచున్నారు—కాని—

సాంఘికముగా చేయవలసిన మార్పులనుగూర్చి ఇతోధికమైన ప్రయత్నము జరుగుతున్నట్లు కనుపించదు - స్త్రీలు, పురుషులు, భగవంతునిదృష్టిలో సమానభాగస్వాములని - వేదములు నిరూపించుచున్నవి. ఆదర్శమునకు ఆదిదంపతులు - పార్వతీ పరమేశ్వరులే తార్కాణము.

కాని ఆచారములు, సాంఘికకట్టుబాట్లు కొన్నిఏర్పరచి, స్త్రీలను బానిసకన్న హీనముగా చూచిన రోజులు లేకపోలేదు. ఇవిస్వార్థపరులైన పురుషులు ఏర్పఱచిన నిబంధనలుగాని సహజముగా స్త్రీ స్వశక్తిపైనాధారపడి స్వాభిమానముచే ధైర్యముతో యీసాంఘిక శృంఖలములనుండి బయటపడుటకు కొంతకాలమునుండి ప్రయత్నములు జరుగుచున్నవి. ఇందులో విజ్ఞానవంతులైన మహిళలు చేసినసేవను ఉద్ఘాటించుట అనవసరముకాదు. స్త్రీలోకము చేయుప్రచారమునకు ఇతోధికసహాయము చేయుటకు విజ్ఞానముగల్గిన ప్రతివ్యక్తి వెనుదీయడు.

సాంఘికముగా చాలమార్పులు కలుగవలసిన యీసమయములో, చలనచిత్రనిర్మాతలుకూడా యీ విషయమును దృష్టిలోపెట్టుకొని, అనవసరఘట్టములను కల్పించి స్త్రీచేత అసహ్యాకరమైన అభినయాలను, అనవసర నగ్నదృశ్యాలనుకల్పించి స్త్రీజాతికి తీరని అవమానంచేస్తున్నారు. యీదురలవాటు పోవాలంటే స్త్రీలోకం ఆందోళనచేయాలి - ప్రేక్షకస్త్రీలకంటె సినిమాలోకంలోవున్న సోదరీమణులు పూనుకుంటె త్వరగా యీదృశ్యాలు మాసిపోతాయి. పురుషులకున్న అభిమానం స్త్రీలకులేదా ?

ఉదాహరణకు "యోగి వేమన" లో (వాహినివారి) వేమన, సర్వసంగ పరిత్యాగియేకాక, దేహాభిమానాన్నికూడా వదలివేసి గోచిపాతకూడాలేకుండా దేశదిమ్మరియై తిరిగినట్లు "వేమన" పద్యములవల్ల తెలియుచుండగా - ప్రకటనలలోకూడా దిగంబరియైనట్లు వివరింపగా - చిత్రంలోమాత్రము అభిమానంఅడ్డొచ్చి, నిర్మాతలు పురుషులగుటచేత నిర్మాణములో పురుషుని నగ్నముగా చూపింపవెరచిన నిర్మాతలకు, స్త్రీని భోగలాలసులైన భోగపురుషునికి భోగ్యవస్తువుగా స్త్రీని ప్రదర్శించి, స్త్రీలోకమునకు అవమానపఱుచ వెనుదీయనందుకు చాలావిచారము ఆశ్చర్యము కలుగకమానదు.

ఆర్థికదృష్టిలో అట్టి నగ్నదృశ్యములను కల్పించి ప్రేక్షకులను ఆకర్షింప డబ్బుసంపాదించవలెనని చూచుచున్నారేకాని, స్త్రీలోకమునకు ఎంతఘోరముచేయుచున్నారో వీరు ఊహించుటలేదు.

తండ్రికాని, సోదరుడుకాని ప్రక్కనకూర్చొని చిత్రంచూస్తున్నారంటే, స్త్రీహృదయం అవమానంతో ఎంతకృంగిపోతుందో ఊహించినయడల ఇట్టిదృశ్యములు చిత్రమునుండి మాయమైపోగలవని తలుస్తాను.

కావున చలనచిత్రనిర్మాతలు, నటీమణులుకూడా, పాత్రలను, సమానగౌరవ మర్యాదలతో చూడ కోరుతూ ఇకముందు నిర్మింపబోవు చిత్రములలోనైనా అసహ్యాకరమైన అనవసరమైన ఘట్టాలుకల్పించక స్త్రీజాతికి, వారిసాంఘికాభివృద్ధికి నిర్మాతలు తగుశ్రద్ధవహించెదరని తలచుచున్నాను.

కొంపల్లి శారదాంబ



కేసరీ కన్యావిద్యాలయ ప్రారంభోత్సవమునకు వచ్చిన పెద్దలు

శ్రీ మహారాణి సాహెబావారును, శ్రీ కేసరిగారును, శ్రీ గోవిందరాజాచారిగారును, మధ్య కూర్చొనియున్నారు.

# కేసరీ కన్యావిద్యాలయ స్థాపనము
## 24-6-48



### శ్రీ శ్రీ శ్రీ విద్యావతీ దేవిగారు ప్రారంభోత్సవము సల్పిరి.



### గౌ. జస్టిస్ గోవిందరాజాచారిగారు అధ్యక్షతవహించిరి.



మైలాపూరునందలి డీసెల్వారోడ్డునగల "హెర్మిటేజ్" అను భవనమున 24.6.48 నాడు శ్రీ కేసరీ కన్యావిద్యాలయమునకు శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా విద్యావతీదేవిగారు ప్రారంభోత్సవమును సల్పిరి. ఈ ఉత్సవమునకు న్యాయమూర్తులు శ్రీ గోవిందరాజాచారి, ప్రత్తిపాటి సత్యనారాయణరావుగార్లు, డా. తిరుమూర్తి, శ్రీ మునగాలరాజా, ప్రొ. డి. యస్. శర్మ, విస్సా అప్పారావు, కేపా రామేశం, బులుసు సాంబమూర్తి, కల్నల్ శాస్త్రి, సామి వెంకటాచలంశ్రేష్ఠి, పప్పు సోమసుందరం ప్రభృతులు పలువురు ప్రముఖులు విచ్చేసిరి.

విద్యాలయావరణమున విశాలమగు శిరీషవృక్షచ్ఛాయలో సభ ఏర్పాటైనది. సభాసదులలో ముఖ్యుల ఛాయాపటముతీసిన యనంతరము సభ సమావేశమాయెను. గౌ. శ్రీ గోవిందరాజాచారిగారు, కేసరీవిద్యాలయ కమిటీ కోశాధికార్లు సభాధ్యక్షత వహించిరి. ప్రార్థనానంతరము సభాధ్యక్షు లిట్లుపన్యసించిరి:—

ఈ కమిటీ అధ్యక్షులు శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు అనివార్యములైన కారణములచేత గ్రామాంతరము వెళ్లినందున నాకీకార్యభారము వహింపవలసివచ్చినది. మీ అందరికి స్వాగతము.

ఏ కారణము చేతనైతేనేమి చెన్నపట్నంలో తెలుగుపిల్లలకు తెలుగులో చదువుకొనే అవకాశాలు క్రమంగా అంతరించుచున్నవి. మాకీ అవస్థ 1940లోనే తటస్థించినది, పెణత్తూరు సుబ్రహ్మణ్యయ్యర్ హైస్కూలు బ్రాంచిలో తెలుగుతీసివేశారు. అప్పుడు మైలాపూరులోనున్న తెలుగువారము మనపిల్లలకు తెలుగులో చదువుచెప్పించుకోజాలక పోవడము న్యూనతగాభావించి ఒక ప్రైమరీ స్కూలు పెట్టించినాము; దానికందరము చందాలువేసినాము. అయితే చెన్నపట్నములో ప్రాథమిక పాఠశాలచాలదు. అంతకన్న దానినభివృద్ధిపరుప తంటాలుపడుచుంటిమి. అట్టి సమయమున శ్రీ డాక్టరు కేసరీగారు మీ రీవిద్యాలయమును అభివృద్ధిచేసి నడుపుటకు పూనకొన్నచో-నేను ధనమిచ్చెదను అనిరి. మీరు ధనమిచ్చునెడల మేము తప్పక ఈ పాఠశాలను నడిపెదమనిచెప్పి మేమీ కార్యభారము పూనితిమి. క్రమముగా నాపాఠశాల హైస్కూలై దిన దినాభివృద్ధినందుచున్నది. దానిలోటుపాట్లనన్నిటిని నిరంతరము సర్దుబాటుచేయుచు దానిని చక్కగా నడిపించుటకు అన్నివిధముల కృషిచేయుచున్నాము. దినదినము అసంఖ్యాకముగ ప్రవేశమునకై విద్యార్థులు వచ్చుచున్నారు. వీరా హైస్కూలునకిచ్చిన భవనములు మున్నగునవన్నియు కలిపి లక్ష ఏభై వేల రూపాయల విలువగలవి.

అసలు కేసరిగారికి మొదట బాలికావిద్యాలయము నేర్పరచవలెననే సంకల్పము, అయితే మేము బాలురకే విద్యలేకున్నదనియు బాలికలను ఇందు చదువవచ్చుననియు,-కావున ముందు ఈ స్కూలును

వృద్ధిపరచి పిదప ప్రత్యేకకన్యావిద్యాలయము మాట ఆలోచింపవచ్చుననియు చెప్పితిమి. వారును సరియని అందుకు వొప్పుకొన్నారు. అయితే వారిమనస్సంతయు కన్యావిద్యాలయముపైననే లగ్నమైయున్నది, పోయిన సంవత్సరము బాలురవిద్యాలయము వార్షికోత్సవసందర్భమున-శ్రీ కేసరిగారు అయాచితముగా, హఠాత్తుగా లక్షరూపాయలు బ్యాంకులో పర్మనెంట్ డిపాజిట్ గానుంచిన రసీదును మాచేతనుంచి కన్యావిద్యాలయమును పెట్టండి- అని ఆదేశించినారు.

మేము తయారుగాలేము. ఈ రోజులలో ఇండ్లు దొరుకుటకష్టము. అందులోను విద్యాలయము పెట్టదగిన ఇల్లు దుర్లభము, గతసంవత్సరమంతయు చాల వెతకితిమి. మా కార్యదర్శి శేషాచలపతిగారు చాల తంటాలుపడిరి. గత సం॥ న విద్యాలయమును ప్రారంభింపజాలనందుకు సిగ్గుపడుచు ఈసంవత్సరమెట్లైన స్కూలుపెట్టవలయునని తీర్మానించుకొంటిమి. అవసరమైనచో (Shift System) మార్చి మార్చి బాల బాలికల విద్యాలయములు వెనుకటిభవనములోనే ఉంచుదామనియు తలంచితిమి. ఇట్లనుకొని ఇంటికి రాగానే హిందూపత్రికయందు "హెర్మిటేజ్" అద్దెకివ్వబడునని చూచితిని. వెంటనే ఫోనుమీద దానిని నిర్ణయించి కార్యదర్శిగారికి తెల్పితిని. వారడిగినఅద్దె ఇచ్చి దీనిని బాడుగకుతీసుకున్నాము. ప్రస్తుతం ఇది ఈఅద్దెభవనంలో నడుచునేగాని త్వరలో స్వంతభవనమును నిర్మించెదము. ఈ సంవత్సరం ఈ కన్యావిద్యాలయంలో 1 మొదలు 4 వ ఫారముపరకు ఉంచినాము. వచ్చే సం॥ ము 5 వ ఫార ముంచుతాము. ఇది దిన దిన ప్రవర్ధమానము కాగలదు.

ఈ విద్యాలయ ప్రారంభోత్సవము జరుపుమని మేము శ్రీ శ్రీ శ్రీ విజయనగరంమహారాణీసాహెబా వారిని కోరినంతనే వారంగీకరించి విచ్చేసియున్నారు. మాదియు విజయనగరమే; విజయనగరంలో చదువుకొన్నాను. వారి పేరు విద్యావతిదేవిగారు. కేవలము పేరుననేగాక ఆమె నిజముగా విద్యావతి. విజయనగరం జమీనువారు విద్యాపోషణయందు పేరుపొందినవారు. అట్టివారు మనకు లభ్యముకావడం మన అదృష్టము; ఈ విద్యాలయమునకు శుభము. శ్రీ మహారాణీసాహెబావారిని మీతరపున నాతరపున కేసరీ కన్యావిద్యాలయ ప్రారంభోత్సవము గావింపుడని కోరుచున్నాను.

## శ్రీ శ్రీ శ్రీ మహారాణీ సాహెబా వారి ఉపన్యాసము

నాకు కేసరిగారిని చిరకాలమునుండి తెలియును. ఆయన చాల నిరాడంబరజీవి, ఇతర జోక్యము లెరుంగక ప్రశాంతముగ కాలము గడుపువ్యక్తి. వీరినిచూచి, వీరితోమాట్లాడిన, 'వీరేనా రెండున్నర లక్ష రూపాయలను విద్యా వ్యాపకమునకై దాన మొనర్చి వితరణశాలి' అని, అనిపించగలదు.

విద్యాలయమునకై దానమొనర్చుట ప్రశస్థమైనది. అందునను బాలికల విద్యాలయమునకై లక్ష రూపాయల దాన మొనర్చుట ఉత్తమోత్తమము. మన దేశీయ వ్యవహారము లన్నిటివలెనే - విద్యా విధాన మును చాంచల్యావస్థయందున్నది. వృత్తి విద్యయా, శాస్త్ర విద్యయా-అనువాద వివాదములట్లుంచుడు. కొన్ని విషయములు ప్రాతిపదికగా అందరు నేర్చి తీరవలసియున్నది. అందు ముఖ్యముగా బాలికలు నేర్వ వలయును. ఈ ప్రాతి పదిక విద్యయంతయు మాతృ భాషలో బోధింపబడుచుండుట శ్రేష్ఠమైనది. ఈ కేసరీ కన్యా విద్యాలయమున బాలికలకు తెలుగున బోధింపబడుననుట మిక్కిలి సంతోషదాయకము.



శిరీష వృక్షచ్ఛాయల సమావేశమైయున్న  కేసరీ కన్యావిద్యాలయ ప్రారంభోత్సవ సభ.
గా॥ శ్రీ గోవిందరాజాచారిగారు ఉపన్యసించుచున్నారు.

దానము ఉత్కృష్ట కార్యము; దాని నొనర్చుటలో కొంత నాజూకు తనము చూపదగును; దానికొక వైఖరియు నున్నది. ఆ రహస్యమెరింగినవారు శ్రీ కేసరిగారు.

ఈ విద్యాలయకమిటీ యందు గొప్పవారు సభ్యులైయున్నారు. విద్యాలయమునకు చక్కని ఉపాధ్యాయ వర్గమును ఉన్నది. తప్పక ఇది దినదినాభి వృద్ధి గాంచునని ఆశించుచున్నాను. దీనికై కేసరిగారొనర్చినది భూరిదానమే. అయితే ఇది వారొక్కరి పనిగా భావింపక ఎల్లరు కాయకష్టల తోడ్పడి దీని నభివృద్ధికి తెచ్చెదరని విశ్వసించుచున్నాను. నాకీ అవకాశమిచ్చిన కమిటీ వారికి కృతజ్ఞురాలను.

## శ్రీ కేసరిగారి యుపన్యాసము

నాకు మొదటినుండిన్నీ కన్యా విద్యాలయము పెట్టవలెననే ఉద్దేశము. ఆ వివరము లన్నియు శ్రీ గోవిందరాజాచారిగారు చెప్పియున్నారు. నేటికి నా సంకల్పము నెరవేరినది. స్త్రీలకు కేవలము శాస్త్రజ్ఞాన సంబంధమైన విద్యయేగాక-బ్రతుకు తెరువుచూపు వృత్తి విద్య, దేహదార్ఢ్యము కల్పించు దేహపరిశ్రమము అవసరమని నాకు చిరకాలమునుండి దృఢమైన అభిప్రాయము. అట్టి వృత్తి విద్యావంతు రాండ్రు కాపురమునందు యథోచిత సంపాదనాపరులై కుటుంబాదాయమును పెంచి, తనకు బిడ్డలకు అవసరమైన చిల్లరఖర్చులకు భర్త నడుగనవసరము లేకుండా గడుపగలరు. అట్టిది కుటుంబ సౌఖ్యమునకు తోడ్పడును. దైవదుర్విపాకమున ఆమె వంటరిగాజీవింపవలసి వచ్చినప్పుడు - నిరాధారయై బిచ్చమెత్తుకొ నవసరము లేకుండా స్వయం కృషిచే తన్నుతాను పోషించుకొనగలదు. అట్టి శక్తి ఆమెకు ఆత్మ గౌరవమునిచ్చును. భర్తకును చులకనగాదు. మరియు వంటరిగా నుండవలసినప్పుడు, తిరుగవలసివచ్చినప్పుడు దేహపరిశ్రమచేసి దృఢకాయము కలదైన దుర్మార్గులు ఆమెజోలికిరారు; వచ్చినను బుద్ధి చెప్ప వచ్చును. విద్యావంతురాండ్రను, అవివాహితలను పురుషులు పరిచయమొనర్చుకొనుటకు తంటాలు పడుదురు. అట్టి పరిచయములొక్కొక్కచో ప్రణయములుగాను పరిణమించును. అయితే కుత్సితుడగు పురుషుడు, తన స్నేహితురాలిని నిజముగా తన జీవితభాగస్వామిగా గైకొన దలంపకున్నను, నామెతో విలాససంపద లనుభవించి తుదకు విసర్జించును. అట్టి సమయములలో స్త్రీ అతనికి బుద్ధిచెప్ప నేర్చి యుండవలయును. ఇటీవల ఢిల్లీలో శకుంతలయను కన్యచేసినపని మీరు పత్రికల చూచి యుందురు. ఆమె చర్యకు నేను హర్షించితిని. అవసరమైన యువతు లట్టి చర్య జరుపుటకు తగిన ధైర్య సాహసములనిచ్చు సైనికశిక్షణ పొందవలయును. కావున ముఖ్యముగా స్త్రీ విద్యావిధానమున ఈ శాస్త్రవిద్యయు, వృత్తివిద్యయు, సైనిక శిక్షణమును-కలిసి యుండవలయునని నా అభిప్రాయము.

ఈ రోజున ప్రారంభోత్సవము జరుపుటకు శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీ సాహెబా విద్యావతి దేవిగారు లభించుట విశేషము. ఆమె నిజముగా విద్యావతి-సరస్వతి. ఆంగ్లము, సంస్కృతము, హిందీ - ఈమూడుభాషలయందును ఆమెకు పాండిత్యముకలదు. విజయనగరం జమీందారులు మిగత జమీందారులవంటి వారుకారు. వారు విద్యాప్రియులు, విద్యాపోషకులు. వారు విజయనగరమున శాస్త్రకళాశాల, గానకళాశాల, సంస్కృత కళాశాల మూటిని నడుపుచున్నారు. విజయనగరం ప్రభువులలో శ్రీ ఆనంద గజపతిగారు విద్వాంసులు, సుప్రసిద్ధులు. వారీ నగరమున ఎన్నో దాన ధర్మములు చేసినారు. అట్టి కుటుంబమునకు చెందిన శ్రీ మహారాణీగారు ఈ విద్యాలయ ప్రారంభోత్సవము జరుపుట శుభస్కరము, శోభస్కరము. నా కొక్క కోరిక కలదు. శ్రీ మహారాణీ సాహెబావారు ఈ కన్యావిద్యాలయమును తమదిగా భావించుకొని దీని యందు ఎక్కువ శ్రద్ధబూనవలయునని నా అభిలాష.

తర్వాత శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు వ్రాసిన ఈ క్రింది స్వాగత పద్యములను శ్రీమతి జానకిరాణిగారు (జ్యోతిష చక్రవర్తి ప్రొ. క. ఆంజిగారి ధర్మపత్ని) శ్రావ్యముగాచదివిరి.



శ్రీకన్యావిద్యాలయ
మాకరముగనవ్యకళల కలరుచునుండన్
శ్రీకాంతుండెవ్వేళల
ప్రాకటముగసిరులొసంగి పాలించుధరన్.

స్వాగతమో! అశేషజన సన్నుతరాజ్యరమాలలామ; సు
స్వాగతమో! రమారమణి సత్కులవంశ సమన్వవాయ; సు
స్వాగతమో! ప్రసన్నముఖ భావమనోహర దివ్యగాత్రి; సు
స్వాగతమమ్మ నీకెపుడు సౌఖ్యపరంపర గల్గుగావుతన్.

విద్యయేముక్తికి విమలమాసాధన మ్మనుటకు నీదునామంబె సాక్షి
భాషానురక్తి నీభూషణం బనుటకు నీదుయధ్వర్యమే నెగడుసాక్షి
విద్యాభివృద్ధి నీవెలలేని యీవిచే వెలయుననుటకు నీవలుకెసాక్షి
వాఙ్మయసేవయే భారతాంగనలకు విహితమనుటకు మావిలుపెసాక్షి
ఆంధ్ర నారీమణులలోన అగ్రమతివి; కేసరీ కన్యకాలయ కీర్తిసతము
నిలుచుగావుత, నీకీర్తి కలనగలిగి, విజయనగర మహారాణి వినుతవాణి.

వినుమా! బోటులకెల్ల మేటివనగా విద్యావతీదేవివై
దనరన్ నీదగు పేరుపెంపినయ విద్యాసక్తితో కేసరీ
ఘన విద్యాలయమున్ స్వకీయసుతగా గాపాడుమా తల్లివై
నినుగీర్తించును తోడునీడవనుచున్ నీసంస్థ పెంపొందుచున్.

బాలికాబాలకోపాధి బంగారమా విద్యాలయంబు స్థాపించినట్టి
వనితలపాలిట వరప్రసాదంబన వేడ్కతో లోధ్ర కల్పించినట్టి
విజ్ఞానచంద్రికల్ వెదజల్లగాజాలు గృహలక్ష్మి గూర్మి స్థాపించినట్టి
కవితామతల్లుల గౌరవోన్నతినిల్పి తోరంపు కంకణాల్ దొడిగినట్టి



కేసరీ కన్యావిద్యాలయమున్చిన " హెర్మిటేజ్ " భవనము

శ్రీ కేసరిగారు మెట్లపై ముందు నిల్చియున్నారు.

కేసరికి నేడు మీరాకకీర్తినొసగు నీదుప్రోత్సాహకలనచే నిరతముగను
వసుధ వృద్ధినిపొందు నీపాఠశాల రాణిసాహేబ శ్రీమహారాణి రాణి.

ఆపిదప శ్రీ మహారాణీసాహెబావారు లేచి ఇట్లుచెప్పిరి:

రెండు సం||లనాడు నాకు చాలాజబ్బుగానుండగా బెంగుళూరునందు శ్రీ కేసరిగారు నాయందు వాత్సల్యముంచి ప్రతినిత్యము నా వ్యాధివిషయమై విచారణచేస్తూ సలహాయిచ్చేవారు. ఇప్పుడుతెలిసినది; నా కీకన్యావిద్యాలయ మప్పజెప్పుటకై వారంతగా నాయందుశ్రద్ధవహించిరని (సభలో హర్షధ్వనులు). వారు నన్నొకకోరిక కోరినారు. తప్పకుండా నాకాలములో కొంత ఈ విద్యాలయానికై వినియోగిస్తాను.

కన్యావిద్యాలయం ప్రధానోపాధ్యాయిని శ్రీమతి మంజులమ్మ బి. ఏ. యల్. టి గారు సభాసదులకు వందనము లర్పించినపిదప అధ్యక్షులు సభముగించిరి. సభామధ్యమున కమిటీకార్యదర్శి శ్రీ మైదవోలు శేషాచలపతిపంతులుగారు శ్రీ అల్లాడి కృష్ణసామయ్య, అవినాశగలింగంచెట్టి, దుర్గాబాయి ప్రభృతులంపిన సందేశముల చదివిరి. సభకువచ్చిన పెద్దలందరు భవనములోనికివెళ్లి భవనమంతయు పరిశీలనగాచూచి కన్యావిద్యాలయమున కన్నివిధముల దగియున్నదని మెచ్చుకొనిరి.

---

# ఒక చిన్న విషయం

నేనేదో యథాశక్తి యత్కించిత్ దాన మొనర్చితినని పేపర్లగాంచి ప్రతినిత్యమును తెలుగుదేశమునందలి వివిధప్రదేశములనుండి పలువురు, నిజముగా అవసరముగలవారు తమ బిడ్డలచదువులకై సహాయముచేయుమని అర్థించుచు వ్రాయుచున్నారు. నిజముగా వీరందరి ఆర్తితీర్చుటకు తగినశక్తిసామర్థ్యములు నాకీశ్వరుడిచ్చియుండవలసినది. అయితే ఆయన పరిమితముగా అనుగ్రహించినాడు. అంతకే కృతజ్ఞుడనై ఈ విద్యాలయముల స్థాపించి నిర్వహించుటకై పూనుకుంటిని. చెన్నపట్నంలో తెలుగు బాలబాలికలకు మాతృభాషలో విద్యనేర్పు ఏర్పాట్లు క్లుప్తమని రోజూ పేపర్లు వ్రాయుచున్నవిగదా. ఆకొరత దీరుటకై ఈరెండు హైస్కూళ్లును ఏర్పడినవి. నాకుగల శక్తిసామర్థ్యము లన్నియు, ఈ విద్యాలయముల యభివృద్ధికొరకే కేంద్రీకరించియున్నాను. చెన్నపట్టణమున గల తెలుగుబిడ్డల క్షేమమును గమనించి, నాకిందుకు పూర్తి అవకాశమిత్తురుగాక అని ఈ లేఖలవ్రాసినవారికి, వ్రాయదలచినవారికి విన్నవించుకొనుచున్నాను.

కే. యస్. కేసరి

# ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈ దిగువ, స్థలములలో ఏజంట్లు కావలయును.

ఇచ్ఛాపురం
సోంపేట
నరసన్నపేట
పాలకొండ
బొబ్బిలి
సాలూరు
తాడేపల్లిగూడెం
చీరాల
యలమంచిలి
కాకినాడ
కందుకూరు
కనిగిరి
గిద్దలూరు
కంభం
నర్సారావుపేట
పాలకొల్లు
అమలాపురం
జగ్గయ్యపేట

వివరములకు:

## 'గృహలక్ష్మి' కార్యాలయము,

15, వెస్టుకాట్ రోడ్డు,
రాయపేట,
మద్రాసు.

# రక్తహీనతాబాధితులకు ప్రశస్తమైన ఆహారం.



బలహీనులకి, రక్తహీనులకి, ఆరోగ్యమిచ్చి, కళ్లలో చమకు, అవయవాలకి చలాకీతనమూ ప్రసాదించే టానిక్ రక్తోజ్. మాతకే గాక, శిశువుకికూడా, అవసరమయిన ఆహారం ఇస్తుందికనక, అప్పుడే ప్రసవించిన తల్లులకి, రక్తోజ్, మరీ ప్రశస్తమయిన టానిక్.



# రక్తోజ్

దక్కన్ ఆయుర్వేదాశ్రమ్ ఫార్మసీ లిమిటెడ్
హైదరాబాద్, దక్కన్.

ADARTS DAY 534 TL

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎస్. కేసరి

## లలితకళాభిలాష

చిత్రకళ, నాట్యకళ, గానకళ మొదలగు లలితకళలందు నాకు చిన్నప్పటినుండి నైజముగానే ఎక్కువ అభిలాషకలదు. శాస్త్రయుక్తముగ ఆయావానిని అభ్యసించుటకు నాకు పూర్తిగ అవకాశములేకపోయినను ఆయావానిని చూచి, విని, వాని ప్రాశస్త్యమును తెలియగల సహృదయుడను అని నామిత్రు లనుచుందురు. నాకుగల ఈ సహజాభిలాష, అభిమానము - ఎట్లు నా జీవితమున వ్యక్తమైనదియు, మరియు ఆయావానిని హర్షించుటలో నా అనుభవములును వివరింతును. వీనిని రెండుభాగములుగ విభజింపవచ్చును. చిన్ననాడు మాయూరియందలి నా యనుభవములు; నగరవాసుడనైన పిదప నాగరికులతోడి నా యనుభవములు.

## గృహనిర్మాణము

గృహనిర్మాణ మొక శిల్పము. దాని రహస్యము లెరుంగుటయు నొక విశేషమే. చిన్నతనములోనే నాకు ఇందు నేర్పుకల్గినది. కుఱ్ఱతనమున ఆడబిడ్డలకు బొమ్మరిండ్లను అందముగ కట్టుచుంటిని. అందువల్ల ఊరివారందరు వారిబిడ్డలకు బొమ్మరిండ్లు కట్టిపెట్టుమని నన్ను ఆశ్రయించేవారు. ఈ విద్య నేను శిక్షణలేకనే అలవరచుకొన్నది. తరువాత పెద్దవాడనై ఆరోగ్యసూత్రముల ననుసరించి పూరియింటిని మట్టిగోడలతో నిర్మించగల సామర్థ్యమును సంపాదించియున్నాను. కాలక్రమమున పట్టణమునందు కట్టబడు పెద్ద భవనములు ఎట్లు నిర్మించిన అందముగాను, ఆరోగ్యప్రదముగను ఉండునో ఆరహస్యముల తెలుసుకొంటిని. ఇప్పటికి మద్రాసులో లక్షలాదిపెట్టి కట్టించిన నా భవనములన్నియు నా స్వంతప్లానులతో కట్టినవే. నా యీశక్తి నెరింగిన మిత్రులుకూడ నా చేతనే తమ యిండ్లకు భవనములకు ప్లానులను చెప్పించుకొందురు. కావున ఇండ్లు కట్టుటయందును, కట్టించుటయందును నాకు కొంత నేర్పరితనము గలదని చెప్పుకొనుటకు సాహసించెదను.

## చిత్రకళ, చిత్రలేఖనము

ఇందును చిన్నతనముననే అభినివేశము ఏర్పడినది. మా అమ్మ పండుగలకు

ఇల్లంతయు గోడలకు శుభ్రముగా సున్నము కొట్టించేది. ఆ తెల్లనిగోడలు చూడగానే నాకు ఉత్సాహము కల్గి బొగ్గుతీసుకొని నాకు తోచినట్లు బొమ్మలు గీచేవాడను. వానిని చూచినవారు ఆయాబొమ్మల ముక్కుకన్నుతీరు బాగున్నదనియు, నాచేతిలో శిల్ప మున్నదనియు మెచ్చుకొనేవారు. కాని మాఅమ్మ తెల్లనిగోడలను బొగ్గుతోగీచి పాడు చేసితినని నన్నుతిట్టేది.

నేను మద్రాసువచ్చినపిదప మద్రాసులో గోవిందప్పనాయుని వీధియందు టి. సుబ్బన్న అండ్ బ్రదర్సు (T. Subbanna & Bros) అను పేరుతో చిత్రములువ్రాయు ముచ్చి వారుండిరి. వీరు కార్వేటినగరం సంస్థానమున రంగుచిత్రములను వ్రాయుచుండిరిగాని ఆ సంస్థానము తగ్గుదశకురాగానే వారు మద్రాసుకువచ్చి బొమ్మలనువ్రాయు వ్యాపారమును స్థాపించిరి. వీరు పలకలమీద చింతవిత్తనముల జిగురుతో బొమ్మలనువ్రాసి దానిమీద సన్నబంగారురేకును అంటించి మెరుగుబెట్టి పటములను తయారుచేయుచుండిరి. అట్లు తయారైన పటములు యెంతకాలమైనను మాసిపోక మెరుగుతో తళతళలాడుచుండును. వీరు ఈలాటి పటములను తయారుచేయుటలో చాలా మంచినేర్పరులు. పూర్వము మద్రాసులో ఈ పటములకు మంచి గిరాకీ యుండెడిది. మద్రాసులో ఇప్పుడును అనేకుల ఇండ్లలో వీరిపటములు గలవు. ముఖ్యముగ గోవిందప్పనాయుని వీధి యందలి ఉప్పుటూరి ఆళ్వారుశెట్టిగారి రామానుజకూటమున ఇవి గలవు. ఈ పురాతన చిత్రకళ క్రమముగ నశించిపోవుచున్నది; నశించిపోయినదనే అనవచ్చును. నేను వీరివద్ద ఈ పటములను వ్రాయుపద్ధతిని కొంతకాలము నేర్చుకొంటిని, అయితే నావృత్తి వ్యాపారములు ఈ కళా వ్యాసంగమున కాటంకములైనవి.

అయినను నాకు నైజముగాగల చిత్రకళాభిమానము ఈ అభ్యాసమువలన స్థిరపడి నది. అందుచేతనే ఎక్కడ ఏ ఉత్తమచిత్రము కన్పించినను అది నన్నాకర్షించును; అది విలువకు లభ్యమగుచో, తెచ్చి మా యింట నుంచుకొనుటకు కోరుదును. చిత్రకళో పాసకులను నేను పూజించి, ఆదరించుటకును అదేకారణము. వెనుక "గృహలక్ష్మి"లో మొదట పని చేసిన శ్రీ కౌతా శ్రీరామశాస్త్రి కుమారులు నా కభిమాన పాత్రులై నావల్ల కొంత సాహాయ్యమును పొందిరి. పిదప పెనుగొండ వాస్తవ్యులు వెంకట్రావుగారు, చిత్రకళలో చక్కని నేర్పుగలవారు, నాకు పరిచయమైరి. వారి బొమ్మలు మద్రాసులో పలువురి ఇండ్ల నలంకరించి యున్నవి. వీరు అప్పుడప్పుడు గృహలక్ష్మి పత్రిక కొరకు త్రివర్ణ చిత్రములను నేర్పుగ చిత్రించి యిచ్చేడివారు. ఈ చిత్ర కళోపాసకుని నా శక్తి కొలది ప్రోత్సహించుచుంటిని. పాపము వారిప్పుడు స్వర్గస్థులు.

## శ్రీమతి రత్నాల కమలాబాయిగారు

ఈమెయు తాను చిత్రించిన త్రివర్ణచిత్రములతో గృహలక్ష్మి పుటలతరచు అలంకరించుచుండినసంగతి పాఠకులకు జ్ఞప్తియుండును. ఈమె చిత్రకళానైపుణ్యమునకు మెచ్చి ఒకసారి గృహలక్ష్మి స్వర్ణకంకణమును తొడిగి గౌరవించితిని. ఇంకను అనేకులు చిత్రకారులు వ్రాసిన చిత్రములను కొని ప్రచురించి వారికి ప్రోత్సాహ మొసంగితిని. ఆ పఠములనన్నిటిని నా యింటియందు గోడల కలంకరించితిని. మద్రాసులో అప్పుడప్పుడు జరుగు చిత్రకళా ప్రదర్శనములకు నా పఠములనుకూడ తీసికొనిపోయి వారు ప్రదర్శించుచుందురు.

## నాట్యకళ

ఆహార్యము, అభినయము, సంగీతము ప్రాధాన్యముగాగల నాట్యకళ బహువిధములు. వీధి భాగవతములు, తోలుబొమ్మలాటలు, భరతనాట్యము, నృత్యము, ఆధునిక నాటకములు-ఇవి అన్నియు ఆ కళ క్రిందికే వచ్చును. వీటన్నిటిని క్రమముగా చూచి ఆనందించితిని. వీటన్నిటి పరిణామము ఈ 60 సం॥లుగా నా శక్తి కొలది గమనించి గ్రహించితిని.

## వీధి నాటకములు

నా నాట్యకళాభిమానము వీధి నాటకములను చూచుటతో ప్రారంభమైనది. బాల్యమున ఈ వీధి భాగవతములన్న నాకు చాల వెర్రి. మా వూరిలో మద్దెల మీద దెబ్బపడిన శబ్దము వినగనే నేనక్కడ హాజరుగ నుండెడి వాడను. నాకు ఈ పిచ్చి ఎందువల్ల కలిగినదంటే, నాకు ఇద్దరు మేనమామ లుండెడివారు; పెద్ద మామయ్య పేరు ములుకుట్ల మహాదేవయ్య; చిన్న మామయ్య పేరు ములుకుట్ల సుబ్బయ్య. పెద్దవారు చక్కగ పాడనేర్చినవారు; చిన్నవారు చక్కగ ఆడనేర్చినవారు. మా ఊరికి భాగవతులువచ్చి నాటకములు ఆడునప్పుడు పెద్ద మామయ్యగారిని తెరచాటున పాడుటకు పిల్చేవారు. చిన్న మామయ్యను వేషములు వేయుటకు పిలిచేవారు. వీరిరువురితో కూడ నేనును హాజరయ్యేవాడను. కనుక మేనమామల పోలికలు నాకు రాకపోయినను వీరి గాలి నాకును కొంత సోకి ఆట పాటలమీద అభిరుచి మాత్రము కలిగియున్నాను.

## మాల నాటకములు

నా కుఱ్ఱతనమున మొట్టమొదట నేజూచినవి మాలనాటకములు. ఆ రోజులలో మావూరి మాలవాడనుండి మాలవారువచ్చి గ్రామమునకు దూరముగ స్థళమును

ఏర్పాటుచేసుకొని రామాయణ నాటకమును ఆడేవారు. వారు రాముడు, సీత, లక్ష్మణుడు, హనుమంతుడు మొదలైన వేషములు ధరించి నాటకములాడేవారు. మాసినగుడ్డలను, లక్కరంగు ఆభరణములను ధరించేవారు. కాళ్లకు గజ్జెలుకట్టుకొనేవారు. వాటి ఘల్లుఘల్లునకు తోడు తాళము తప్పెటలు వీరికి ప్రక్క వాయిద్యములు. పాడునప్పుడు వీరు అప్పుడప్పుడు తలయెత్తి వెర్రికేకలను వేయుచుందురు. వారు పాడెడువానికి తలాతోకా లేకపోయినను రామాయణకథనే వారిభాషలో కీర్తనలుగా పద్యములుగా తమఇష్టము వచ్చినట్లు కవనముగట్టి పాడేవారు. ఈనాటకములను చూచుటకు ముఖ్యముగా బ్రాహ్మణేతరులే వచ్చేవారు. ఈ నాటకములాడు మాలవారు బ్రాహ్మణుల నాశ్రయించరు. వేషములు వేసేవారందరును పురుషులే. సీతా రామలక్ష్మణుల అరణ్యవాసము, లక్ష్మణ మూర్ఛ, సీతమ్మ శోకము వీటినాడుచు ఆయాపాత్ర లభినయించునపుడు అమ్మలక్కలు కండ్లనీళ్లు పెట్టుకొని దుఃఖించేవారు. ఆరాత్రిఅంతయు నాటకము ఆడినందులకు వారికి పదిమందికలిసి సలకవరిగెలను, దివిటీలకు ఆముదమును ఇచ్చేవారు.

ప్రతివూరి సమీపమునను మాలవాడ, మాదిగవాడ యని రెండుండును. మాలవారు మాదిగవారికంటె గొప్పవారమని చెప్పుకొందురు. మాలవాడలో శ్రీరాముని దేవాలయమును కట్టుకొని రామభజన చేయుచుందురు. వీరిలో హెచ్చుగా భక్తిపరులైన వారు కొందరు ప్రతినిత్యము మొగమునిండ తిరుమణి శ్రీచూర్ణములను, తులసిపేరులను ధరించి భజనకీర్తనలు పాడుచు లౌకికప్రసంగములలోను మెట్టవేదాంతమును మాట్లాడు చుందురు. వీరిని మాలదాసరులందురు. మిగతవారును పండుగ పబ్బములకు నామాలు ధరింతురు. వీరు సామాన్యముగ ఊరిలోని కాపులయిండ్ల కమతముచేసి జీవింతురు. మాదిగవారు కసాయిపనులు చేయుచు, చచ్చిన జంతువుల చర్మములువలిచి చెప్పులు, బావులలో నీళ్లు పొలములకుతోలు మోటబొక్కెనలు కుట్టుచు జీవింతురు. వీరు కొందరు పశువులు సుఖముగానుండి కళేబరములు దొరకక తమజీవనము గడవనికాలమున దొంగతనముగా పొలములలోని పశువులను తోలుకొనిపోయి చంపి, తోళ్లు వల్చుకొని పోవుచుందురు. కర్కశులు కొందరు డబ్బుతీసుకొని కూనీనేరములును చేయుచుందురని నాచిన్నతనములో చెప్పుకొనేవారు. వీరు తప్పెటలువాయింతురు. ఆయాకారణములచే మాలవారు వీరికన్న అధికులుగా తలంచుటయు పరిగణింపబడుటయు జరుగుచున్నది.

## వీధి భాగవతము

తర్వాత మా గ్రామములో నేను చూచిన వీధిభాగవతములు, ఉత్తమతరగతివి. ఈ భాగవతము లాడినవారిలో ముఖ్యమైనవి రెండుజట్లు. ఒకటి: మా గ్రామ

సమీపముననే తమ్మవరము అని యొక గ్రామమున్నది. ఆ గ్రామమునుండివచ్చు తమ్మవరపు భోగము వెంకటస్వామి జట్టు. రెండవది కూచిపూడి బ్రాహ్మణుల భాగవతము జట్టు.

వెంకటస్వామిజట్టులో చేరినవారందరు భోగమువారే. పురుషులు పురుష వేషమును స్త్రీలు స్త్రీవేషమును ధరించేవారు. వెంకటస్వామి హాస్యమును ప్రదర్శించుటలో చాల మేధావంతుడు. ఆ నాటకసమాజమంతయు వెంకటస్వామిచేతులలోనే యుండినది. వీరు మా ఊరికివచ్చినపుడు పాతకచ్చేరిసావడిలో బసచేసేవారు. పిమ్మట గ్రామకరణమును మునసబును దర్శించి నాటకప్రదర్శనమును యేర్పాటుచేసుకొనెదరు. ఒకనాటిరాత్రి నాటకమునకు ఒకవరహా సామాన్యమైన యేర్పాటు. వీరందరు కలిసి ఇంచుమించు 10 మందియుందురు. వీరికి ఊరిలో ప్రతియింట నొక్కొక్కరికి భోజనము పెట్టుదురు. సత్యభామ వేషము వేయుస్త్రీ అందమైనది. కనుక అందరును తమయిండ్లకు ఆమెనే భోజనముకు పిలుతురు. ఆమె భోజనముకు వచ్చిన గారెలు, బూరెలు, పరమాన్నములతోకూడ విందుచేసెదరు. అందువలన ప్రతియింటికి సత్యభామయే భోజనమునకు వచ్చునని వెంకటస్వామి కబురుపంపెడివాడు. కనుక జట్టు అందరికీ పిండివంటలతోకూడ విందుజరిగేది. ఆ దినము నాటకమునాడు స్థలమునంతయు, సాయంకాలము ముదాం వెట్టివాండ్రు చిమ్మించి నీళ్లుచల్లి బాగుచేయుదురు. సుమారు రాత్రి 10 గంIIలకు నాటకము ప్రారంభమగును. ఊరి ప్రజలందరువచ్చి కూర్చుందురు. నాటకరంగమునకు ముందు కరణం మునసబులు ఇంక నసేకమంది బ్రాహ్మణులు, కాపులు, రెడ్లు కూర్చుందురు. వేషము యెప్పుడు వచ్చునాయని ఆత్రముతో వేచియుండెదరు. సాధారణముగ వీరు మొదట భాగవతనాటకమునే ప్రదర్శించెదరు. దీనిలో ముఖ్యపాత్రలు కృష్ణుడు సత్యభామ, గొల్లభామ, సుంకరకొండడు మొదలగునవి. మొదటివేషము (అది సామాన్యముగా భామవేషమో, రాజవేషమో,) తెరచాటునుండి వెలుపలికివచ్చునప్పుడు రెండుదివిటీలను ఆ వేషము మొగమెదుట మోటించి నిల్పి దానిపై గుగ్గిలపు పొడిని జల్లెదరు. ఆ వెలుతురున తెరలోనివేషము బయటపడును. ఇవి నేడు సినీమా రంగమున Still pose అనియు, నాటకరంగమున Flash light అనియు చెప్పబడు విశేషముల మాతృకలు అనదగును. సామాన్యముగా నీ తెరగుడ్డకు సభలో కూర్చున్నవారి దెవరిదో యొకరిది తలగుడ్డఅడిగి తీసుకొని పట్టుదురు.

ఈ వేషధారులు ధరించియుండు ఆభరణములన్నియు తేలికకొయ్యమీద చెక్కి కాకిబంగారము అంటించబడినవి. వాటిని ఇప్పుడుకూడ కొండపల్లిలో తయారుచేయుచున్నారు.

ఆ కాలమున సత్యభామ తన జడను తెర ఇవతలవేసిన 'తనను ఈ సభలో ఎవరైనను భాగవతవిషయమై ప్రశ్నించినచో జబాబుచెప్పగలను' అని సూచన. ఒక్క భాగవతముననే ఏమి? సామాన్యముగా నీ భామవేషమువేయు వ్యక్తి ఆనాటి సకల శాస్త్రములను తెలిసినదైయుండును. ఈవేషమున పూర్తిగాయుపన్యసించుటకు ఒకటి రెండు రాత్రిళ్లు పట్టును. అందు శాస్త్రముల నన్నిటిని తడవి వేషధారి తన విద్వత్తు ప్రకటించును. చూలింతయైన దేవకీదేవి-పిండోత్పత్తిక్రమము, గర్భరక్షకవిధులు, పురిటింట సన్నాహము, బాలింత పథ్యపానములు, శిశుపోషణ పద్ధతులు - మొదలైనవాని నన్నిటిని ఆయుర్వేద వైద్యశాస్త్రరీత్యా ఉపన్యసించును. సత్యభామ శృంగారరసమందలి సాత్వికావస్థలను, నాయికా నాయక లక్షణములను, ఉపన్యసించును. దీనినే భామకలాపము అందురు. ఇదియొకవిధముగ నాటికాలమున వయోజనవిద్యావిధానము అనజెల్లును. పైవిధముగా నీ భామ తనజడను తెరలోపలినుండి రంగస్థలమువైపున తెరబయటకు జారవిడువగనే సభాసదులలో, ముఖ్యముగ పండితోత్తములకు ఉక్రోషమువచ్చి— "ఏమీ? ఈ సానిది మావంటి పండితులున్నారనియైన తెలుసుకొనకుండ, జడ ఇవతలవేసి అవమానించుచున్నదే?" అని ఉగ్రులై చీకాకుపడి ఆమెను భాగవతములోని పద్యములను కృష్ణకర్ణామృతములోని శ్లోకములను చదివి భావార్థముల చెప్పుమని అడిగెదరు. అవి చెప్పినంతనే విడువక, ఇంకను భరతశాస్త్రమునందును, అలంకారశాస్త్రమునందును ప్రశ్నింతురు. అన్నిటికి జబాబిచ్చినచో మెచ్చికొనెడివారు. ఆనాటి భోగముపడుచులు సామాన్యముగ విద్వత్తుకలవారై, పండితపరిచయమును కలవారుగనుండిరి. తమ పరీక్షకంతయు తాళినను మరియు నీర్ష్యాపరులు కొందరు మంత్రశాస్త్రము నాశ్రయించి ఆ భామవేషధారికేదైన వికల్పము కల్పించుటయు కలదని వింటిని. సామాన్యముగ ప్రతిజట్టులోను నొక మంత్రశాస్త్రవేత్తయుండును. ఆతడు అట్టి సమయముల దానికి ప్రతిక్రియగావించి సర్దుకొనును.

నాటకము పూర్తిగాకముందు సత్యభామ ముందు కూర్చున్న పెద్దమనుష్యులొక్కొక్కరివద్దకువచ్చి కూర్చుండి తనజడను వారివారిమెడలకుచుట్టి రెండుబుగ్గలను వత్తి ఒక జావళిపాడును. అప్పుడతనికి వళ్లుపులకరించి తబ్బిబ్బులయి, తలగుడ్డముడినుండి ఒకటో రెండో రూపాయలనుతీసి భామచేతిలో వణుకుచు పెట్టును. అప్పుడు వెంకటసామి బహుమతి ఇచ్చినవారి పేరుచెప్పి పొగడుచు పద్యములు చదువును. ఈపద్యములు సామాన్యముగ ఎవరిపేరైన ఇరికించుటకు వీలుగా పూర్వమే వ్రాయబడి కంఠస్థమైయుండును. ఈప్రకారము ఆరాత్రి బహుమతులు సుమారు 20 రూ॥ లకు తక్కువ లేకుండ భామవేషధారి సంపాదించును. ఈసందర్భమునుచూచి తరుచుగా ఊరి పెద్దశెట్టి మెల్లగ వెనుకకు జారుకొనును. నాటకము తెల్లవారి 5 గం॥ల వరకు జరుగును. అటు

పిమ్మట వారందరు ధరించిన వేషములతోనే గ్రామములో ప్రతియింటికివచ్చి చీరెలను ధోవతులను భిక్షమెత్తెదరు. ఆ కాలమున గుడ్డకరువు లేదుగనుక వారు వేషములను వేయు వస్త్రములను సంపాదించుకొనువారు. ముఖ్యముగ వీరు భాగవత నాటకము, హరిశ్చంద్ర నాటకము, నలచరిత్ర, ఉషాపరిణయము ప్రహ్లాదనాటకము మొదలైనవి ప్రదర్శించేవారు.

## కూచిపూడి భాగవతుల వీధి నాటకములు

ఈ నాటక సమాజమునకు చెందినవారందరును కూచిపూడి వాస్తవ్యులగు బ్రాహ్మణులు. ఆడవేషమునుగూడ మగవారే ధరించుదురు. వీరు రంగస్థలమునకు వచ్చినపుడు పురుషుడువేసిన స్త్రీ వేషములను గుర్తించుట సులభముగ నుండెడిది. వీరిరేటు గూడ అంతజాస్తిగా నుండేదికాదు. వీరు బ్రాహ్మణులు గనుక భోజనాది వసతులు సులభముగ వూరిలో కుదిరేవి. వీరు మధ్యాహ్నపు వేళలో యెవరి యింటిలోనైన వేషములువేయకుండ అష్టపదులు, కృష్ణకర్ణామృతములోని శ్లోకములు, తరంగములు పాడి, అభినయముపట్టి భరతశాస్త్ర ప్రదర్శన మొనర్చెడివారు. మరియు పండిత పామర రంజకముగా జాతీయములు చెప్పుదురు. జాతీయములనగా హాస్యప్రసంగములు. ముసలి మగడు-పడుచు భార్య, చాంధస గురుశిష్యులు, ఇత్యాదుల సంభాషణములను-ఒక్కరే రెండు గొంతులతో ఆయారసము ఉట్టిపడచెప్పి సభాసదులను కడుపుబ్బ నవ్వించేవారు. వీరిలో కొందరు గారడీకూడ చేయగలవారుండిరి. వీరు తరంగములు పాడునప్పుడు అద్భుతముగ నృత్యము చేసెడివారు. పళ్లెములో నీళ్లు పోసియుంచి ఒక్క చుక్కనీరైనచింద కుండ దానియంచుపై నిల్చినృత్యముచేయు చుగంటలకొలది "బాలగోపాలమాముద్ధరే" అనే తరంగమును పాడగల నేర్పరులుండిరి. ఈ తరంగమున శ్రీ నారాయణ తీర్థులవారు తాళప్రస్తారమునకు ఎంతో అవకాశము కల్పించి వ్రాసియున్నారు. ఆ కళా సంతతివారు చాలమంది ఇప్పుడులేరు ; ఉన్న కొద్దిమంది సినిమాలలోచేరి ప్రాచీనకళను మరచిపోవు చున్నారు ; చాలపేలవమైన నర్తన పద్ధతుల ననుకరింపబోయి వికృత మొనర్చుచున్నారు. సినిమాలున్నూ, రేడియోయున్నూ ప్రాచీనమగు భరతశాస్త్రమును, సంగీతకళను ధ్వంసమొనర్చుచున్నవని శ్రీ జయకర్ గారివంటి పండితోత్తములే గోలపెట్టుచున్నారు.

కూచిపూడివారి పలుకు స్ఫుటముగను, ఉచ్చారణ స్వచ్ఛముగను ఉండును. వీరి హాస్యమును మోటుగాక సరసముగనుండును. వీరికి భాగవతమే విశేషముగ అభిమాన పాత్రమగు నాటకము. అందు శ్రీ కృష్ణజనన ఘట్టములో "దాదిని మంచము"— (బాలింతరాలి మంచము) అని వీరు ప్రవేశపెట్టుచుండిన యొక విశేషము నాకిప్పటికిని జ్ఞాపకమే. వెదురుబద్దలతో మంచము, లేసుగా తయారుచేయుదురు. అందు బాలింత

శిశువుతోకూడ పడుకున్నట్లు అమర్చుదురు. నడుముకట్టు మున్నగువానితో శృంగారింప బడిన బాలింత మంచముపై పరున్నట్లైయుండి — మంచముక్రిందికి కాళ్లు దిగవిడుచును. అట్లేయుండి ఆమె నడచుచు పాడుచుండును. మంచమును ఆమెతోకదలి నడుచుచు చూపరుల కాశ్చర్యముగొల్పును.

## చెంచునాటకములు

ఆ కాలమున చెంచునాటకములను గొల్లవారుచేరి ప్రదర్శించుచుండిరి. వీరి నాటకములు పల్లెటూళ్లలో చాలపేరుపొంది యుండినవి. ఒక ఊరిలో వీరు చాలదినములు బసచేసి నాటకము లాడుచుండేవారు. వీరి నాటకములో ముఖ్యమగు ఇతివృత్తము అహోబిల నారసింహస్వామి చెంచెతను (చెంచువారి పడుచును) మోహించి వివాహ మాడుట. ఈ అహోబిలక్షేత్రము కర్నూలుజిల్లాలో చెంచువాండ్రు నివసించు అడవిమధ్య నొక కొండయందున్నది. ఆ స్వామి యుత్సవ సమయమున చెంచుపడుచులు విల్లనంబులు చేత బట్టి చురుకుతనముతో యాత్రికుల మధ్య స్వేచ్ఛగా చకపిక తిరుగుచుందురట. వారి స్వేచ్ఛా స్వాతంత్ర్యములజూచి అది స్వైరిణీ స్వభావముగా తలంచి ఎవ్వడైన పొరబడెనా వానిని గట్టిగా చెంపవాయగొట్టుదురట. ఆ చెంచెత కథనే—"గరుడాచల మహాత్మ్యము" అని పూర్వకవి యక్షగానముగా వ్రాసియున్నాడు. దాని ననుసరించి ఈ నాటకమును వీరాడుదురు. వీనిలోని పాటలు వూరివారందరు పాడుచుందురు. గొడ్లకాచుకొను పిల్లకాయలు ముఖ్యముగా వీనిని విడువక పాడుచు పొలములలో చెట్లక్రింద ఆడుచుందురు. ఈ పాటబాణి అందరికి అందుబాటులో యుండును. అందరి నోళ్లలోను నానేచరణము:—

"నన్ను పెండ్లాడవే చెంచీత"

## తోలుబొమ్మలాట

మా వూరి రంగిరీజులు గుడ్డలమీద బొమ్మలనువేసి అద్దుటకు అలవాటుపడినవారు గనుక పలచని తోళ్లను బొమ్మలవలె కత్తిరించి వాటికి రంగులనువేసి వాని సహాయమున నాటకములాడుచుండిరి. ముఖ్యముగ నేను జూచిన నాటకము రామాయణము. ఈ రామాయణ నాటకములోని దశకంఠుడు, ఆంజనేయుడు, సీత మొదలగు వారి చిత్రములతోకూడ వానరరాక్షస సేనలుండినవి. ఈ బొమ్మలకు చేతులుకాళ్లు తలమున్నగు అవయవములన్నియు విడివిడిగనే చేయబడి-దారములతో కట్టబడియుండును. బొమ్మలకు వెనుకప్రక్క అన్నిటికి కలిసివచ్చునట్లు వెదురుబద్దలను కట్టుదురు. ఆ బద్దలకుదారములమర్చెదరు. ఈ సూత్రములను (దారములను) అన్నిటిని కథ నడుపువారు పదివ్రేళ్లకు తగిలించుకొని చేతబట్టుకొని లోతెరలో తెరపై బొమ్మల నుంచి నిల్తురు. పిదప కథాను

సరణముగ ఆయా సూత్రములు లాగుచు ఆబొమ్మల అవయాంగముల నాడింతురు. తెరలో దీపములుండును. ఇవతలయుండవు. తెరలోని వెలుతురువల్ల - ఆ రంగుబొమ్మలు తెరపై ముందుభాగమున పెద్దవిగా ప్రతిఫలించుచు నిజముగు వేషధారు లాడుచున్నట్లుండును. తెర వెనుకనున్నవారు ఆయా కథ పట్టులు-వచనమున, పద్యముల, పాటల పల్కుచుందురు. అందుచే ఆయా పాత్రలే ఆడుచుపాడుచున్న ట్లుండును. బహుశా ఇది భారతీయ నాటమునకు ఆదియేమోనని నా అభిప్రాయము. ఏమంటే సంస్కృత నాటకముల నాటక మాడించు ప్రధాన పురుషుని "సూత్రధారి" అందురు. నిజమున కతడు ధరించు సూత్రమేమియు లేదు. తోలుబొమ్మలాటలలోని సూత్రములే - ఈ "సూత్రధారి"కి మూలమేమో? ఈ సూత్రధారి హస్తలాఘవమున రామరావణ యుద్ధమును, సముద్ర లంఘనమును, లంకాదహనమును, వానరరాక్షస సమరమును, రథములను - మొదలైన వాని నన్నిటిని సందర్భాను సారముగ పాటలతో, మాటలతో, శబ్దములతో, గోదనములతో చిత్రవిచిత్రముగ దృశ్యములుగా చూపగల్గును.

అసలీ తోలుబొమ్మలాటకు మరాటీవారు ప్రసిద్ధి. వారిలో చాలమంది పెద్దవిద్వాంసులు కాకపోయినను - గురుముఖతః విద్వత్తుతో కూడిన నాటకమును వల్లించి, కథ నడుపుట నేర్తురు. వీరు కథనడుపునప్పుడు-సంస్కృత సమాసములను, వాక్యములను చెప్పి-ముక్కముక్కగా విరిచి అర్థము చెప్పుదురు. " అశ్వ = గుర్రములున్నూ, గజ = ఏనుగులున్నూ ...."ఈ విధముగా చెప్పుచుందురు. మరియు నప్పుడప్పుడు అమరమందలి శ్లోకములును చదువుదురు. మాఊరు అద్దంకిసీమలోనిది. అద్దంకిసీమను కొన్నాళ్లు మరాఠీ లేలినారు. నేటికిని వంగవోలులో మరాటీపాలెమున్నది. బహుశా ఆసంపర్కముచే మా ఊరి రంగిరీజుల కిది అబ్బియుండును.

సినీమాలు సైన్సుసహాయమున మొదట ఏర్పడినపుడు బొమ్మలు కదిలేవేగాని మాట్లాడేవికావు; ఇప్పుడు మాట్లాడుచున్నవికూడ. కాని మనప్రాచీను లీఅవకాశములను పూర్వమే ఊహించి వారికి వశమైనంతవరకు ఈవిధముగా అమలుజరిపిరి కాబోలు !

ఇప్పటికే ఈవ్యాసముదీర్ఘమైనది. వచ్చేసంచికలో చెన్నపురవాసినై నాగరికులతో చేరి నేచూచిన నాటకముల విశేషములనువ్రాసెదను.







దమయంతికి నలునకు సంగమ కారణదూతయైన కలహంస మనో
జ్ఞమనుష్య వాక్యముల న ద్దమంతికి హర్షమొసగ దా నిట్లనియెన్.
నీవు నలునకుఁ బేర్మితో దేవి వైనఁగాక నీసముజ్జ్వల రూప కాంతి విభవ
విద్యాసౌభాగ్యభాగ్యాభిజాత్య భద్రలక్షణావళులవి సఫలంబు లగునె!

మహాభారతము.




# శస్త్ర చికిత్స లేకయే

శస్త్రచికిత్సలేకయే మూలవ్యాధులు కుదురుటకు సులభమైన చికిత్సలు:—

దవనము, మరువము, కురువేరు వీనిలో దేనినైననూ మెత్తగనుండునట్టి లేతదానిని సేకరించవలయును. ఉదయమునగాని, పరుండబోవునపుడుగాని అట్లు సేకరించియున్న పదార్థమును గుదస్థానమునసుంచి మెలకువగా గుడ్డతో కట్టు కట్టుకోవలయును. దీనివల్ల దేహమందలి ఉష్ణము ఉపశమించి, ఆ మర్మస్థలమునందలి అన్ని పార్శ్వములు మెత్తగిలి సులభముగ మలవిసర్జనమగును. ఇట్టి సులభ చికిత్స అందరికి అందుబాటులో నుండునది.

ఇందుకు ఔషధము.

| | | |
|---|---|---|
| కరక్కాయ వలుపు | — | 5 తు |
| శొంఠి | — | 5 తు |
| అడవికంద (దురదకంద) కాల్చి పొడి చేసినది | — | 5 తు |
| కలకండపొడి | — | 5 తు |

వీటన్నిటినిచేర్చి చూర్ణము చేయుము. ఈ చూర్ణము ప్రతిఉదయము 1/8 తులము మొదలు ¼ తులము వరకు—నోటిలో వేసుకొని చల్లని నీళ్లు త్రాగుము. మలబద్ధకము వీడిపోవును, మూలవ్యాధులును నశించును.

దాసాని పూలరేకలు విడదీసి అందులో కొంచము పసుపుచేర్చి వెన్నతోగాని, ఆముదముతోగాని, నేతితోగాని కలిపి అవసరమగునట్లు ముద్దగ యొనర్చి, గుదస్థానము నందంటించి యుంచుము. దానివల్ల మలలు వీడిపోవును.

అరటి పూచను లేతదానినితెచ్చి మెత్తగదంచి నీరు వడియగట్టకుండా పైవిధముగానే వాడినచో మంచి ఫలితము నిచ్చును.

ఈ వ్యాధిని సామాన్యముగ మర్మముగ నుంచుటచే వృద్ధినొంది మలాశయము, గుదస్థానము వేడెక్కును. దానివల్ల మలముతో కల్సి రక్తము పడును; లేదా రక్తము పడిన తర్వాతనే మలవిసర్జన మగు

చుండును, అసలు మూలవ్యాధివల్లనే నీరసము కల్గుచున్నది. దీనికితోడు శస్త్ర చికిత్సయు గావించుకొన్నచో, ఆ రక్త స్రావమునుతోడై, నరములు బలహీనములై ఆరోగ్యభంగమగుచున్నది. అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి, శరీరతాపము కడుపునొప్పి, మూత్రాశయము బరువెక్కుట, మొదలగు లక్షణములు ఒకటికొకటి యేకమయి, ద్వంద్వరూపముదాల్చును. అట్టిపరిస్థితులయందు తప్పక పైచికిత్సలలోనేదే నొక్కటి నాశ్రయించి వ్యాధితొలగి సుఖింతురుగాక.

ఉదర సంబంధమగు సకల వ్యాధులకు సులభ చికిత్సలు

కడుపునొప్పి చాలాభయంకరమైన దుష్టవ్యాధి. దీనివల్ల చాలామంది అనేకకష్టముల పాలగుచుందురు. క్రమముగా నది ముదిరి తీవ్రరూపమును దాల్చుచుండును. ఇది మనకు అనుభవములోనున్న విషయమే. ఇట్టి వ్యాధి సంభవించుటకు అనేక కారణములుండును. వానిలో ముఖ్యమైనవి మత్తుపదార్థములు సేవించుట, చుట్టబీడీలు త్రాగుట, పరిమితి మీరి భుజించుట, మలబద్ధకము నిద్రలేమి, విశ్రాంతిలేమి, మొదలైనవి. ఇట్టివి సాధారణముగా చికిత్సకు అలవిగాని వ్యాధులు. కాని అన్ని స్థలములలో సామాన్యముగా లభ్యమయ్యే మూలిక సంపుటీకరణముచేసి సేవించిన నెమ్మదించగలదు. చిరకాలమునుంచి ఉన్ననూ శీఘ్రముగ శాంతించును. శస్త్రచికిత్స నొందకున్న యెంతమేలైనను చేకూరను. పైనతెల్పియుండు దురభ్యాసములను సంపూర్తిగా వర్జించి ఈ ఔషధమును ఒక మండలము సేవించవలయును. సేవించు నిర్ణీతసమయములలో పై అలవాట్లతోపాటు ఉప్పుకారము, వాడుటకూడ తగ్గించవలయును.

ఔషధము తయారొనర్చు విధానము

| | | | | | |
|---|---|---|---|---|---|
| జీలకర్ర | — | 2 తులములు | శొంఠి (వేయించినది) | — | 2 తులములు |
| ఉప్పు | — | 2 ,, | కరక్కాయ బెరళ్లు | — | 2 ,, |
| అతిమధురం | — | 2 ,, | ఎండు ద్రాక్ష | — | 8 పండ్లు |
| వాము | — | 2 ,, | లవంగములు | — | ¼ తు |
| కలకండ | — | 2 ,, | లవంగపు పట్ట | — | ¼ ,, |
| వేపాకులు (ఎండినవి) | — | 2 ,, | తాటి బెల్లము | — | 8 ,, |

మొదలగునవి, బాగుగనుండునవి తీసియుంచవలయును. 18 తులముల నేతిని ఒక బాణలిలోపోసి. కాచి అందులో ఈ చూర్ణమునువేసి జాగ్రత్తగా కలియబెట్టుచు 8 తులముల తేనెను పోయవలయును. ఇట్లు తయారైనది 48 రోజులకు సరిపోవును. ఉదయము ¼ తు చొప్పున పరగడుపున పుచ్చుకొని 4 ఔన్సుల మజ్జిగ త్రాగవలయును. రాత్రిపూట ఇదే పరిమాణమును పుచ్చుకొని 8 ఔన్సుల మజ్జిగ త్రాగవలయును. 15 సం||ల లోపు వయస్సువారు యుక్తాయుక్తముగ సేవించదగును.





# బ్రతుకు తెరువు



జాం, జెల్లీలు తయారుచేయుట:—

జాం: అనగా మధురములగు పండ్లరసముతో తయారగునట్టి తాండ్ర. అట్టి మధురములగు పండ్లరసముతో తయారుచేయు ముద్దలు, గోలికాయలకు జాం అనిచెప్పుదురు.

జెల్లీ:—ద్రవమునుగాక గట్టియునుగాక, కొంచెము జిగటగనుండునట్లుగా పండ్ల రసమును చక్కరతో పాకముపట్టి తయారుచేసి దానిని జెల్లీ అని చెప్పుదుము. సామాన్యముగ జాం, జెల్లి అని పేరులు చెప్పుదుమేగాని పదార్థవిమర్శన తెలియదుగాన వివరింపబడినది.

ఇట్టిపనుల కుపయోగించు పండ్లు సరిసమానముగా పండియుండవలయును. శుభ్రముగా నుండవలయును. మంచి వేసవిరోజున కోసినవిగా నుండవలయును. చిత్తడి రోజులలో కోసినపండ్లు పనికిరావు. నిల్వవుండవు. కోసిన వెంటనే వుపయోగపర్చవలయును. మొదట బాగుగాకడిగి, యెండబెట్టి చెక్కుతీయవలసినవాటిని చెక్కుతీయవలయును.

జాం మూడువిధములుగ తయారొనర్చబడును.

(1) పంచదార నీళ్లతోటి పాకము తయారొనర్చి వుంచుకొని తర్వాత పండ్ల రసములను చేర్చుకొనవలయును.

(2) పండ్లను పండ్లగానే వలిచి పంచదారనుచేర్చి కల్పి కుదిలించవలయును. సరిసమానముగను, పల్చగను వుండునట్లు చూడవలయును.

(3) పండ్లను పంచదారనుచేర్చి ప్రథమమునుంచే వండుటలేక ఉడకబెట్టవలయును.

ఇట్టివి తయారొనర్చుటకు మంచి పంచదారనే వాడవలయును. లేకున్న వృథాయగును. పొంగిపోవును. ప్రతివిధానముకు పరిమాణములు మారుచుండును. మరియు పండ్లయొక్క మంచిచెడ్డతో అనుసరించికూడ మారుచుండును. పండ్లరసము 1 పౌను తూకమయిన ¾ పౌను మొదలు 1 పౌనువరకు పంచదారను చేర్చవచ్చును. పంచదారను తగు పరిమాణము వేయకున్న జాం చెడిపోవును. జాస్తిఅయిన గడ్డలుకట్టి పండ్లయొక్క సువాసనపోవును.

పరిశుభ్రత ముఖ్యముగా గమనించవలయును. ఇనుప సామానులు యెంత మాత్రము వాడకూడదు. వాడినయెడల వాటిరంగు మారిపోవును. జాం తయారగుచున్నప్పుడు పొంగులు త్వరలో రానివ్వకు. నురుగు చిక్కగాను మడ్డిగానుండును.

వంటపూర్తియగుటకు చేయువిధానము. ఉపయోగించు పండ్లు, వుడుకుటనుబట్టి ఆధారపడియుండును. నీరుతోయున్న పండ్లతోవండుటకు చాలాకాలముపట్టును. కొంచెము సేపులో తయారయినవి బాగుండనేరవు. గట్టిగానుండును. అంటుకొనును. పండుయొక్క వాసనపోవును.

(రాబోవు సంచికలో జెల్లీలనుగూర్చి వివరించబడును.)




# గోధుమ (WHEAT)

ప్రస్తుతము జీవనాధారమునకు విరివిగా పైరగు పంటలలో గోధుమపంట ముఖ్యమైనది. ఎందుకనిన అది గట్టిధాన్యము. పొల్లుధాన్యముకాదు. మరియు శరీరపాటవమును సంరక్షించి పోషణకు అవసరమగు సమస్త జీవగణములతో చేరియున్నది. మానవశరీరము శారీరశాస్త్రరీత్యా ఓజస్సు, రక్తము, మాంసము, కండరములు, ఎముకపుష్టి, మూలగ, మజ్జ, చర్మము, పొరచర్మము, ఎముకలు మొదలగునవి మానవశరీరమునకు యెట్లు ప్రాధాన్యము వహించి శరీరధర్మమును అనగా ఆరోగ్యమును నిలబెట్టుచున్నవో, అలాగే గోధుమ, ధాన్యము కూడ పరిశీలించిచూడ పైతోలు (లేక పైభాగము) మధ్యభాగము, లోపలిభాగము, మొదలగునవి అన్నియు వకటికొకటి అన్యోన్య గుణప్రభావముకల్గి పోషణకు ఆధారములైయున్నవి. అయితే పైమూడు పొరలుగల భాగములు పొట్టుక్రింద శేషించినది తెల్లనిపిండిగాను కనుపించును. ప్రధమభాగమంతయు విడిపోవు పొట్టుగానేపరిణమించును. కాని ఇట్టివి ఆహారపదార్థములతో యిమిడియుండిన ఉదరప్రేగులశక్తి క్రమముగ పనిచేయుచుండి జీర్ణమై ఆరోగ్యమిచ్చును. మరికొంతభాగమునందు తగునట్టి క్షారమునుకలిగియుండును. ఇట్టి గట్టి ధాన్యమును ఆహారపదార్థములుగా తయారుచేసుకొని భుజించుటవల్ల ఎముకపుష్టి, శిరోజముల నలుపు, అందము బిరుసుదనము, కేశాభివృద్ధి, దంతబలము ఇచ్చుననుటలో యెంతమాత్రమును అతిశయోక్తిలేదు, దీనిలో సరిపోలిన మరికొన్ని గట్టిధాన్యములు-అనగా-జొన్న, రాగి, సొజ్జ, సర్వవిధముల గోధుమ గుణములను కలిగియుండునేగాని, రూపములువేరు.

గోధుమ పిండిని-పులియునట్లుచేసి రొట్టె (Bread) ను తయారుచేయుటలో-పులియుటవల్ల వచ్చిన పొంగు ధాతు సంపూర్ణమైనది. అది రొట్టె అయినప్పుడు దానిలోనే సహజముగ తగినపదార్థమునుపట్టి ముఖ్యముగా రొట్టె జీర్ణమగుటకు తగినంత సహకారిగానుండును. గోధుమలో సంపూర్ణమగు-చమురుపదార్థము శరీర అవయవములు పెరుగుదలకు అనుకూలమైనది. సత్తువను-వృధాకాకుండ నిల్వకొనతగినట్టి బిగితనమునకు కావలసిన పదార్థము గోధుమయందు సంపూర్తిగనున్నది.

ముఖ్యముగ:—ఎముకగట్టి, కేశవృద్ధి, దంతబలము, ఫలయుతమగు కండరములు యేర్పడుటకు ఉష్ణము ముఖ్యముగాన, అట్టి ఉష్ణమును సమముగ-అనగా సమశీతోష్ణముగ జనింపచేయుటలో తగుమైన ఆహారము.

గోధుమ పిండిని తయారు చేయుటలోకూడ యంత్రసహాయముగగాక పూర్వపు తిరుగండ్లతోవిసరుట ద్వారా తయారుచేయునట్టి పిండి గోధుమ సన్నెను నిల్వనుగాన సమధాతు యుక్తమైయుండును. ఇట్టి విషయములు తేలికగా తెలుసుకొనుటకు యెంత వ్రాసిననూ,-పాకశాస్త్ర మెరింగిన గృహిణులు చక్కగ-అనుభవనీయముగ తయారు చేయుటలో-ఆరోగ్య భాగ్యము-మహిమ. యుండును.

ఇంకొక విషయము:—గోధుమ పాకపరిపక్వములయందు-పొరపాటున ఉప్పువేయకున్ననూ, పొట్టు ఒకవేళ గోధుమలపైన వూడకున్నచో ఆ పొట్టులోగల ఉప్పు పదార్థమువల్ల ఉప్పురుచి కలిగియుండును, మరియు ఒకవేళ పంచదార అభావమై చేర్చకున్నను-విసిరిన గోధుమపిండి అయిన తప్పక తీపిరుచినిచ్చుట యేగాక పంచదారను మరపించును. గోధుమయందు చమురు యిమిడి యుండుటవల్ల, మరల నెయ్యి, వెన్న, పాలు, మొదలగునవి చేర్చవలసిన పని యుండదుగాని-అయితే మానవ రూపసౌందర్య లావణ్యములకు ప్రకృతి ఆధారమయియుండ కృత్రిమాలంకారములు యెట్లు అలవాటయ్యెనో-అటులనే కొన్ని లోపములవల్ల-నెయ్యి, పాలు, పంచదార, మీగడ, వెన్న మొదలగునవి అనుపానాది క్రమణిక ప్రకారము సంపుటీకరణమొనర్చి పక్వమొనరించుట జరుగుచున్నది. పక్వాశయమునకు బలమొసంగి యౌవనుల జేయుటచే దీనికి "యవలు" అనికూడ పేరొప్పుచున్నది.

ఉపయోగవిధానములు:—భోజనమునకు పనికివచ్చు ధాన్యములలో గోధుమ పుష్టికరము గనుకనే చాల మందికి పలువిధములుగ ఉపయోగపడుచున్నది. గోధుమరొట్టె పులియపెట్టిన పిండితోను, డొప్పటి కప్పుడు తయారగు పిండితోను తయారుచేసి కొనెదరు. (పెనము) మూకుడుపై పేల్చినరొట్టె సామాన్యముయిన జీర్ణ శక్తిలేని వారలకు ఉపయోగపడును

కొంతమంది రొట్టెను భోజనముగనే వాడుకొందురు. అయితే గోధుమ పిండితో తయారు చేయబడు రొట్టెలలో కొంతపొట్టుకూడ కలిసియుండుట మంచిది. అట్లుండిన మలబద్ధకము వీడుటకు సదుపాయ మేర్పడును.

కాఫీ విత్తులతో తయారుచేయు కాఫీకంటె గోధుమతో తయారుచేయునట్టి కాఫీ అన్ని విధముల మంచిదే.-పెద్దవారలకేకాక బిడ్డలకుకూడ నుపయోగించవచ్చును. తయారొనర్చుట ఎట్లనిన:- అవసరమగునన్ని (తోక) గోధుమలు తీసికొని మట్టిమూకుడుబాణలిలో వేసి వేయించి మంచివాసన వచ్చునపుడు దింపి చల్లారనిచ్చి తిరగలిలోపోసి మెత్తగ పిండి యగునట్లు విసరవలయును. (అందరకు అలవాటైన కాఫీ మోస్తరుగనే)-రెండు కప్పుల నీళ్లను బాగుగా మరగనిచ్చి ఒకచెంచాడు గోధుమపిండినివేసి, వడబోసి దానిలో అవసరమయినన్ని పాలు, పంచదార చేర్చి ప్రతినిత్యము కాఫీ పుచ్చుకొను సమయములయందు త్రాగవచ్చును. ఈ విధముగ తయారుచేయబడిన కాఫీని ప్రత్యేకముగా పుచ్చుకొనుటయేగాక ఆహారము పుచ్చుకుంటూ, మధ్యమధ్య పానీయముగకూడ జీర్ణశక్తి ననుసరించి పుచ్చుకోనగును.

ఔషధ విధానము:—రాత్రిపూట అరసోలెడుగోధుమలు నీటిలో నానవేసి మరునాడు ఉదయము బాగుగ రుబ్బి వడియగట్టి వచ్చిన దానిలో 5 తులముల పంచదారనుచేర్చి ప్రమేహములయందును, శరీరము ఎల్లప్పుడు వేడిగనుండువారలకు వయసుకు తగిన శరీరకాంతి, లేనివారకును పెరుగుదలలేని బిడ్డలకును యివ్వవచ్చును.

కీళ్ల నొప్పులు, వాత నొప్పులు, రక్తమునందు మాలిన్యముచేరి యుండుటవల్లకల్గు ఆమవాతము నొప్పులకును:—

గోధుమలను వేయించి మెత్తగావిసిరిన పిండిలో అనగా

గోధుమపిండి 1 తులము

తేనె 1 తులము

కల్పి రోజునకు రెండుపర్యాయములు యివ్వవచ్చును.

ఋతుస్రావములు :- గోధుమపిండితో తయారొనర్చిన గంజియిచ్చిన శరీరమునకు పుష్టినిచ్చి ఋతుధర్మమును కాపాడును.

గోధుమపిండితో అనేకవిధములగు రొట్టెలు, చపాతీలు, బిస్కట్లు, పూరీలు, పాలపోళిలు, మొదలగునవి చేయుదురు.

గోధుమపిండి సమయమునకు హాజరుగావున్న First Aids Dusting Powder అనగా, అకస్మాత్తుగా సంభవించు గాయములు, దెబ్బలు. రాతిపోట్లు మొదలగునవి సంభవించినపుడు రక్తమాపుటకును, దెబ్బవల్ల శరీరము పగులుట మున్నగు వానియందును, ఉపయోగించవచ్చును

గోధుమపొట్టుతో శరీరముపైన ·అవసరమగునప్పుడు, కాపడము వేయుటకు ఉపయోగించును. స్వాభావికముగ గోధుమపొట్టునందు ఉష్ణము నిలిచియుండుటవల్ల, శ్లేష్మసంబంధమయిన ఉద్రేకములలో, రొమ్మునొప్పి, బిడ్డలకు డొక్కలు యెగరవేయుట, వ్యాధితీవ్రతననుసరించి వేడిమి యెక్కిరాకుండు పట్లు వాడుట చాలామంచిది.

విరేచనసాధనకు :- పొట్టుతో చేర్చి తయారొనర్చిన రొట్టె శ్రేష్టము.

గోధుమలచే తయారైన నూనె తామరఅను మొండి చర్మవ్యాధుల యందును, మేహవ్రణములు అనగా మాంసమును తినివేయుచూ లోతుకల్గిన గడ్డలకును ఉపయోగించునును.

# ఇంటిపనులలో మెళుకువలు

## బిడ్డలపై తల్లుల బాధ్యత

-శ్రీ కచ్చు సుబ్రహ్మణ్యంగారు.



తల్లి నవమాసాలుమోసి, నానావస్థలూపడి బిడ్డను కంటుంది. సహజంగా తల్లికి తన బిడ్డంటే ఎంతో అగాధమైన ప్రేమ. తనబిడ్డకోసం తనసర్వశక్తులూ వినియోగించి పాటుపడుతుంది. ఆబిడ్డతోనే తనకీ ప్రపంచంలో ఆనందం !

అయితే—కొందరు తల్లులు తమబిడ్డలేది కోరితే అది లేదనక తెచ్చియిచ్చి ఆనంద పడతారు. కొండమీద కోతినైనా పట్టితేవడానికి సందేహించరు. అట్లా అతిగారాబంతో పెరుగుతూ పెద్దవాడవుతాడు అనుకోండి. బిడ్డ క్రమంగా తన్నెవ్వరూ ఏమీఅడ్డుపెట్టరనే దృఢసంకల్పం ఆ లేతహృదంలో పాతుకుపోతుంది. ఇల్లంతా అల్లరిమయం చేస్తాడు. ఇరుగుపొరుగు వాళ్లనకునే బూతులు అలవరచుకొని అప్పుడప్పుడూ జ్ఞానమనేది లేకుండా ఇంట్లోవారిమీద, చివరికి తల్లిపైనికూడా ప్రయోగిస్తాడు. ఏమాట అనాలి, ఏమాట అనకూడదన్న జిజ్ఞాస పసితనం అవటంవల్ల తెలీదు. ఇట్లా పిల్లాడు బూతులు నేర్చుకున్నాడని తెలిసీకూడా మెదలకూరుకుంటూ, వాడప్పుడప్పుడవ్యక్తపు మాటల్తో చిన్నా పెద్దలనే భావంలేకుండా బూతులు తిడుతూవుంటే నవ్వుతూ ఆనందిస్తూవుంటుంది.

తన యీ ఆనందమే, అశ్రద్ధయే తన కన్నకుమారుడి భావిజీవితాన్ని వక్ర మార్గానికి లాక్కువెడుతుందే అన్న ముందాలోచన ఆ తల్లికి వుండదు. పెద్దవాడై లోకజ్ఞానం తెల్సింతర్వాత కుమారుడు తనలో మొలకలెత్తి ప్రమాణైకూచొన్న బూతుల ప్రయోగాన్ని, తిరస్కారాన్ని మరవడు. చిన్నా పెద్దలమీద వల్లిస్తూ, ఏమైనా అంటే తిరుగు సమాధానం సూటిగా, పెంకితనంగా చెపుతాడు.

తల్లికి తన పిల్లాడిపైని వుండే అతిగారాబమే తనకు ముప్పుతెచ్చింది. దీనికి నిదర్శనంగా వక పాతకధ వుంది.

తల్లి గారాబంవల్ల కుర్రాడు అదుపాజ్ఞలులేక అల్లరివాడై స్వేచ్ఛావిహారం చేస్తూ క్రమంగా దొంగతనానికి అలవడ్డాడు.

ఇంటిలోని కానీలు, అణాలు మాయమయ్యేవి. ఇట్లావుండగా ఒకనాడొక కూరలమ్మి వారింటికొచ్చింది. తల్లి కూరలబేరం చేస్తోంటే, కొడుకు మూడు వంకాయల్ని దొంగిలించి రహస్యంగా తల్లికిచ్చాడు. తల్లి ఏమీ అనక సంతోషంతో పుచ్చుకుంది.

కుమారుడు నానాటికీ పెచ్చు పెరిగిపోయి పెద్ద పెద్ద దొంగతనాలు చెయ్య మొదలు పెట్టాడు. ఒకరోజున ఓధనికునియింట్లో చాలవిలువగల చంద్రహారాన్ని దొంగిలించి పారిపోతోంటే పోలీసులు పట్టుకున్నారు.

కోర్టులో అడిగారు. "నేనే దొంగను" అని ఒప్పుకున్నాడు. జడ్జి తీర్పుచెప్పే ముందు తన తల్లిని రప్పించాల్సిందని కోరాడు. తల్లివచ్చింది. "అమ్మా" అని దగ్గరగా పిలిచి చెవిలో రహస్యంగా చెప్పుతోనట్లునటిస్తూ పటుక్కున చెవి కొరికేశాడట. జడ్జి బెదరించగా నేరస్తుడన్నాడుగదా—"అయ్యా! చిన్నతనంలో కానీలు దొంగిలిస్తోంటే నాతల్లి నన్నేమీ అన్లేదు. తర్వాత వంకాయలమ్మి బుట్టలోంచి మూడు వంకాయలు దొంగిలిస్తే సంతోషముతో పుచ్చుకుంది. కాబట్టి అదుపాజ్ఞలు లేందా చివరికి చంద్ర హారాన్ని దొంగిలించాను. దీనికంతాను కారణం నాతల్లి. ఆమె నన్ను దొంగతనం చెయ్య నీయక కొట్టివుంటే నేనీపని చెయ్యక పోదునుకదా అన్న కసితో కొరికేశాను"

చూశారా! తల్లి బాధ్యత లేక పెరిగిన కుమారుడి స్థితి.

తల్లి మాతృదేవత. తన్నుమించిన దైవంబు మరొకటి లేదు బిడ్డకి. తల్లిప్రేమ అతి అగాధప్రేమ. కాని కుమారుడి జీవితాన్ని ధ్వంసం చెయ్యడం ఆమెకు సుతరామూ యిష్టంవుండదు. కాబట్టి కుమారుడి మంచికోరుతూ అదుపాజ్ఞల్తో సక్రమమైన మార్గానికి తెచ్చి విద్య నేర్పించి తనబిడ్డ జీవితాన్ని సుఖమయం చెయ్యడం ప్రతి తల్లికీ విధ్యుక్త ధర్మం. అది తన బాధ్యత.

తల్లి తనబిడ్డకి విజ్ఞానం గరపడానికి ఎన్నో నీతికథలు, వీరచరిత్రలు బోధిస్తూ, అతడిలోని చెడుగుణాల్ని, పిరికితనాన్ని ఆవలకి నెట్టివేసి మంచి త్రోవకు తీసుకురావాలి.

అయితే - తల్లులు, "పిల్లల్ని గారాబం చెయ్యడం పూర్తిగా పనికిరాదా?" అని ప్రశ్నించవచ్చు.

పిల్లల్ని ముద్దులాడ్డం, గారాబం చెయ్యడం సమయానుకూలంగా తల్లులు జరిగించాలి. తనబిడ్డ ఏకుణాన చెడుమార్గాన తెలిసో తెలీకో ప్రవేశిస్తున్నాడో, అది కనిపెట్టి వెంటనే దాన్ని మాన్పించాలి. నీతిని గరపాలి, లేదా బెదరించిగాని కొట్టిగాని దుండగాన్ని అణగద్రొక్కాలి. అట్లా కొట్టినంతమాత్రాన తమపిల్లలు కందిపోతారనే మూఢభావం వదులుకొని తమ బాధ్యత నెరవేర్చుకొనడం వారి విధి.

⸻(★)⸻

# సామెతలు

151 కల్యాణము వచ్చినా కక్కు వచ్చినా నిలువదు.
152 వ్రాయగా వ్రాయగా కరణము, దగ్గగా దగ్గగా మరణము.
153 గాజులబేరము భోజనానికి సరి.
154 గుమ్మడికాయల దొంగ అంటే భుజాలు తడుముకొన్నాడట.
155 గొడ్రాలి కేమి తెలుసు బిడ్డనొప్పులు.
156 చల్లకు వచ్చి ముంత దాచనేల ?
157 చదివేది రామాయణము పడగొట్టేది దేవస్థలము.
158 తుమ్మితే ఊడిపోవుముక్కు ఎన్నాళ్లుండును?
159 తింటేగాని రుచి తెలియదు; దిగితేగాని లోతు తెలియదు.
160 తావలచినది రంభ: తామునిగినది గంగ.
161 తిన్నకుక్క తిని పోతే, కన్నకుక్కను కట్టేసి తన్నినట్లు.
162 నొసలు బత్తుడు; నోరు తోడేలు.
163 చెట్టు పెట్టిన వాఁడు నీరు పోయక మానునా?
164 చిన్న పామునైనా పెద్దకఱ్ఱతో కొట్టవలయును.
165 చేప పిల్లల కీత నేర్పవలయునా?
166 ఎలుకకు పిల్లిసాక్షి.
167 తనకొంగునవున్న రూక; తనకడుపునపుట్టినబిడ్డ ఎన్నటికైన ఒదుగును.
168 తాలిమి తన్నుగాచును-ఎదిరిని గాచును (తాలిమి=ఓర్పు).
169 తల్లి కడుపు చూచును; పెండ్లాము వీపు చూచును.
170 చెడి స్నేహితుని యింటికి వెళ్ళవచ్చునుగాని, చెల్లెలియింటికి **వెళ్ళరాదు.**
171 జీతము బత్తెము లేకనే తోడేలు మేకలను కాస్తానన్నట్లు.
172 చిత్తము శివుని మీఁద, భక్తి చెప్పుల మీఁద.
173 గోవులను కోసి చెప్పులను దానము చేసినట్లు.
174 కొన్నవి వంకాయలు; కొసరినవి గుమ్మడి కాయలు.
175 కోడి గ్రుడ్డును పగులగొట్టను గుండ్రాయి కావలెనా?
176 కోల ఆడితే కోఁతి ఆడును.
177 కొడుకు బాగుండవలె; కోడలు ముండమోయవలె.
178 కూతలార్భాటమేగాని, కుప్పలో గింజలేదు.
179 చెఱువు ఓడైన ఊరు పాడౌను.
180 చెట్టులేని చేను; చుట్టము లేనియూరు కష్టము.
181 చేనుకుగట్టు, ఊరికికట్టు యుండవలయును.
182 తొలకరిని చెఱువు నిండినా; తొలిచూలు కొడుకుబుట్టినా లాభము.



# ఊర్వశి



శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు



మునులాపాటను ఆనందాశ్చర్యాలలో మునిగి పోయారు. వారాతర్వాత - 'ఓతరుణులారా! భువన మోహనమయిన మీ సౌందర్యాన్ని, మీ హావ భావ విలాసాల్ని, మృదుమధుర కోమలమయిన సంగీతాన్ని, నాట్యాన్ని వర్ణించేవారెవ్వరూ లేరు. మిమ్మల్నిచూస్తే మా హృదయం పరమానందంతో ఉప్పొంగిపోతూఉంది. మాచిత్తాలు సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాయి. మీ రా లోకాన్నుండి ఈలోకానికి-అందులో మా ఆశ్రమానికి మేమురమ్మని ప్రార్థిస్తేమాత్రం వస్తారా? రారు. రారు, రావడానికెంత శ్రమపడ్డారో కదా! కావున మీరందరూ మా ఆశ్రమంలోఉండి, మాపరిచర్యల్ని గ్రహించి, మావిందులారగించండి. ఓహో! మీ ప్రభువు, దేవేంద్రుడు మాతపస్సును భగ్నంచేయుమని మన్మథవసంతులకు, తోడుగా మిమ్మల్ని ఇలా పంపించాడు. పాపం. మాయందాతనికి ఇలా దయ పుట్టింది. అయితే, మీరాతని కార్యాన్ని ఏ మాత్రమూ సాధించలేరని చెపుతున్నాము. ఇదిగో, మీ సౌందర్య శృంగారాదుల్ని ధిక్కరించే దివ్య కాంతను సృష్టిస్తాను చూడండి. దాన్నిచూస్తే మీరు చాలాసిగ్గుపడతారు. మాశక్తి సామర్థ్యాలు మీ కప్పుడు బాగాతెలిసివస్తాయి.' అంటూ నారాయణుడు తనతొడటప్పన చరిచాడు. ఆచరుపుతో అప్సరోకాంత ఊర్వశి ఉద్భవించింది. ఆతని ఊరువులోంచి ఆమె జన్మించడంవల్ల ఊర్వశి అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. ఆ ఊర్వశీకన్య శరీరకాంతి పూరానికి దేవవేశ్యలు వెలవెలపోయారు. ఆమె శృంగార సౌందర్యాలు వెల్లి విరిసిపోతున్నాయి. ఆమె ముద్దుముఖాన్నిచూసి-ఆదేవకాంతలే మోహపడుతున్నారు. ఆమెను కౌగలించుకోడానికి వారి చేతులు అప్రయత్నంగా లేచిపోతున్నాయి. రంభ ఆమెను సమీపిస్తూవుంది. ఆసమయంలో ఆముని తొడలోంచి అంతచక్కని ఊర్వశేకాకుండా ఆమెలాంటి సౌందర్యలావణ్యాలతో ధగ ధగా మెరిసి పోతూఉన్న మరికొందరు కాంతలామెకు చెలికత్తెలుగా జన్మించారు. ఊర్వశిని సమీపిస్తూవున్న రంభ వారినిచూస్తూ అలాగే వుండిపోయింది. ఆమెతో పాటు మిగతా దేవవేశ్యలందరూ నోటమాటా మంతీలేక నివ్వెరపోయి, బొమ్మల్లాగు నిలిచి పోయారు. అలా వారు కొంతసేపుండి ఎలాగో నెమ్మదిగా మునులతో—

'ఆర్యులారా! మహానుభావులారా! మేమిదివరకు ఇనుపకచ్చడాలు బిగించుకు కూర్చున్న మహామునీంద్రులు ఎందరినో మా ఓరచూపులతో మాఒడిలో పడవేసుకున్నాము. అలా పడినవారు మాచెప్పుచేతల్లో ఎంతకాలంగడిపారో వారికి తెలియదంటే నమ్మండి. వారందు మూలంగా పూర్తిగా కొందరూ, సంగోరు కొందరూ చెడిపోయారు. అలాంటి మావిలాస విభ్రమాలూ, సౌందర్యమూ మీదగ్గర ఎందుకూ పనికిరాలేదు. మీరు కేవలం నారాయణాంశసంభూతులని తెలిసివుండిన్నీ మా సురేశ్వరుడు మీతపోభంగం నిమిత్తం మమ్మల్ని ఇలా పంపించాడు. కాని ఈరాక మాపూర్వపుణ్యవశంవల్ల వచ్చిందని సంతోషిస్తూవున్నాం. ఇలా కానినాడు మీదర్శనభాగ్యం మాకు దొరకదు. మహత్తర జపతప ధ్యానాలవల్ల ఆరముగ్గిన మీరు నీచాతినీచ సుఖానికి ఆశించి, భ్రష్టులవుతారా? వట్టిమాట. స్వామీ! తెలిసీ తెలియకా మాప్రభువుమాట పుచ్చుకొని, మీ సమాధియోగానికి అంతరాయం కలిగించినందుకు మమ్మల్ని మన్నింపుడు.' అన్నారు. ఆ దేవకాంతల మధురస్తోత్రాల కామునులు తమలో నవ్వుకున్నారు. వారిలో తేజోమయుడైన నారాయణుడు,

'ఓ కాంతలారా! మీకూ, మీదేవతా సమూహాలకూ, మీరాజుకూ సౌఖ్యమూ, శుభమూ, ఆనందమూ కలుగుతుంది. నేనిలా ఆశీర్వదించినట్టు మీరాజుతో చెప్పండి. ఈ ఊర్వశిని మీతో

త్వరగా తీసుకుపోయి దేవేంద్రునికి అప్పగించండి. ఇందువల్ల ఆతడు మహానందభరితుడవుతాడు, అన్నాడు. దాని కా కాంతలు వయ్యారంగా పైట సవరించుకుంటూ, చిరునవ్వులతో, మృదు మధుర సాభినయాలతో—

ఓమునీంద్రా! మేము మీపాదసేవ చేసేనిమిత్తం ఇలావచ్చాం. మీదాసీలము. ఇలాంటి మమ్మల్ని మళ్లీ స్వర్గానికి వెళ్లమనడం మీకు భావ్యమూ, న్యాయమూ కాదు. మమ్మల్ని మీరు భరించాలి. ఇక మాకితరులతో ఏపనీలేదు. మాప్రభువును సేవించడానికి ఊర్వశీ, ఆమె చెలికత్తెలూ వెడతారు. మేమిక్కడ ఉండిపోయేటట్టు చెయ్యండి. అన్నారు. అయితే, మీ అభిప్రాయమూ, కోరికా త్వరగా వెల్లడించమన్నాడు నారాయణుడు. అప్పుడా తరుణులు

'స్వామీ! సూర్యచంద్రాదులు తారుమారయినా, భూమీ, ఆకాశమూ కలిసిపోయినా మీవంటివారు ఆడితప్పరు. కావున, మా అందరికీ మీరు భర్తలు కావాలని కోరుతున్నాము. ఇందుకు మీరంగీకరించి కాపాడండి. మేము అనాథలము. మీపాదపద్మాలు నమ్మి ఇలావచ్చాము. మీతో సకల సుఖభోగాలు హాయిగా అనుభవించాలనే కోరికతో స్వర్గలోకాన్ని విడిచివేశాము. మాసానుల్ని ఎవ్వరూ సరిగ్గాచూడరు. అలాంటి మమ్మల్ని మీరుకూడా అనాదరణచేస్తే మాబ్రతుకేమికానూ? మీరే ఆలోచింపుడు. దీనుల్నీ, అనాథల్నీ, మీరే తృణీకరిస్తే మరెవ్వరైనా దరికి చేరనిస్తారేమో చెప్పండి. అందులో మేము కామార్తలం. కాముకురాలయిన కాంత పురుషుని కోరిననాడు ఆతడామెను నిరాకరిస్తే మహాపాపంవస్తుందని మీలాంటివారు అంటారు. చంద్రవసంతాదులతో వచ్చిఉన్న మారుడు పదును పెట్టిన పూవుటమ్ములతో మాహృదయాల్ని నలిబిలిగా చేస్తున్నాడు. మేమాతని ధాటీకి తాళలేక పోతున్నాం. వాని బారినుండి మమ్మల్ని రక్షించి ఏలుకోమని ప్రార్థిస్తున్నాం.

(నా దేవీ భాగవతమునుండి)

[శ్రీమతి రుక్మిణమ్మగారు దేవీభాగవతాన్నంతా ఈవిధంగా సులభశైలివచనముగా వ్యవహారిక భాషలో వ్రాసిఉన్నారు. పూర్వము దాసు శ్రీరాములుకవి తిరుపతి వెంకటేశ్వర కవులు - మున్నగు పెద్దలు విద్వత్కవులు మాత్రమే ఈదేవీ భాగవతాన్ని సంస్కృతంలోనుంచీ భాషాంతరీకరించారు. ఇంకా ఈమె గ్రంథం అచ్చుకాలేదు, వదాన్యుల సాహాయ్యాన త్వరలో అచ్చువేయించగలనని ఆమె ఆశ. గృ॥సం॥]

# లూసీ గ్రే

అనువాదకులు : మధురకవి శ్రీ నాళము కృష్ణారావుగారు



విందు వేమఱు వీనులవిందు లలర
సుగుణముల రాసి, 'లూసి' యను ముగుద గూర్చి;
ప్రొద్దుపొడుపున నా బాల ముద్దుమొగము
కాన దాటినయపు డెల్లఁ గాంచుచుందు.

ఒప్పు లన్నియు నొకచోట కుప్పవోసి,
అందముల నెల్ల నొకచక్కి పొందుపరచి
చేసెఁ గాఁబోలు బమ్మ యా లూసి మోము,
అట్లుగాకున్నఁ గలుగునే యట్టి హొయలు?

కోనలో కొండదరి నున్న గుడిసెయందు
కాపురము సేయు నొంటిగా కన్నెమిన్న;
కట్టెలను కొట్ట జనకుండు కాన కేగు,
పుల్ల లమ్మఁగ నగరికిఁ బోవు తల్లి.

చెంగుచెంగున గుప్పించి చెంగలించు
కన్నెలేళ్లను తిలకింపఁ గలవు కాని,
ముఱువు గులికించు నా కన్నె ముద్దుమొగము
కాంచఁ జాలవు నీ వింక కానలోన.

'బాలరో! నేటిరేయి తుపాను వచ్చు,
పురమునకు నీవు వేగమే పోవవలయు
చేత లాంతరు దాల్చి నీ మాత నిటకు
తోడికొని రమ్ము మంచులో త్రోవ చూపి.'

'అట్లె కావింతు ముదమార ననుగుతండ్రి,
దెసలమలుసంజ యింకను మసల లేదు-
చదలిపై నింక రాలేదు చందమామ,
ప్రొద్దు గూకినయంతన పోయి వత్తు.'

జనకుఁ డా మాట లాలించి పనికిఁ బూని
కట్టెమోపుల విడఁదీయ కత్తి తీసి
కోయుచుండెను బిగివాళ్లు; కొంతవడికి
కేల లాంతరు గీలించి బాల వెడలె.

బంతి మీటిన గతి, నామె గంతులిడుచు
క్రేళ్లువాఱుచు కేళిమై కాళ్లవ్రేళ్ల
మంచుముద్దల నెగఁజిమ్ముకొంచుఁ జనియె
దూదిపింజల వలె నవి మీఁది కెగయ.

బెడిదముగ నంత చెలరేఁగె పెను తుపాను,
ఏమి చెప్పుదు; నా బాల యెన్ని యెన్నొ
గిరుల నెక్కుచు డిగ్గుచుఁ దిరిగెఁ గాని,
కట్ట! చేరంగ లేదయ్యె పట్టణంబు.

పాప, మా తలిదండ్రు లా పాడురేయి
'లూసి! లూసీ!' యటంచు నా లోయ లెల్ల
మాఱు మ్రోఁగఁగ నఱచిరి సారె సారె,
కాని, ఏ సడి యే జాడ గానరైరి.

వేఁగుఁబోకను వా రొక్క వాగు దరిని
వెలయు నొక పెద్ద మెట్టపై నిలిచియుండి;
రచట గాంచిరి పొలమున కవల నున్న
కట్టెవంతెన నొకదాని నెట్టయెదుట.

విసిగి వేసరి వనటచే వెక్కి వెక్కి
యేడ్చి, వారు హతాశులై యింటిదెసకు
మగిడి, యఱచిరి 'లూసిరో! మరల మనము
నాకమునఁ గూడుకొందము గాక!' యనుచు.

కనుఁగొనియె తల్లి యా మంచుకరడులోన
అనుఁగుకొమరిత చిన్నారి యడుగుజాడ;

లేని ధైర్యము డెందమ్ములోన నూని,
వడిగ నేగిరి పొలమువెంబడిని వారు.

అచ్చుగుద్దినరీతి, నా యడుగుజాడ
లన్నియును నొక్క పోలిక నమరియుండె;
వేయికన్నులఁ గనిపెట్టి, వెంట నరిగి,
కడకుఁ జేరిరి వంతెనకడకు వారు.

మంచు కప్పిన గట్టువెంబడిని వారు
ఒక్కటొకటిగ నాజాడ లుత్తరించి
చనిరి వంతెన నడిమిపార్శ్వంబు దనుక;
అకట! ఆ జాడ లంతతో నంతరించె.

'నెలఁత జీవించి యున్నది నేఁడు కూడ
ఆమె వదనారవింద మా సీమయందు
కాంచవచ్చును కన్నులకఱవు దీర'
అంచు కొందరు జనులు వాదించుచుంద్రు.

'చిగురుటడుగుల మెల్ల నా యెగుడుదిగుడు
నేలపై మోపి, చూపుల నింగిఁ బఱపి,
వేడు కలరంగ నా బాల పాడుచుండు
గాలికెరటాల నా పాట యీలవెట్ట.'



# ఆంధ్రభోజుఁడు

శ్రీమతి చి॥ కాలకంధరం పద్మావతిగారు

రాజకులైక భూషణమ!
రమ్యకవిత్వ సమాదరమ్మునన్
భోజునిబోలి సద్విమల
భూరియశమ్ము గడించినావు, వి
భ్రాజితశౌర్య లక్ష్మికయి
వట్టి తరాతులు సేవఁజేయ; నే
రాజులు నీకుసాటి యిల
రాగలవారలు కృష్ణభూవరా!

రాజులు లేరె చూడ; నిల
రాజుల కేమి కొంత గల్గెనా
రాజులరాజువై తనరి
రాష్ట్రములన్నిటి నేలినావు; నీ
రాజన మీయ లేదె పర
రాష్ట్రములన్నియు నాంధ్రరాష్ట్రమున్
బూజలుసల్పి కొల్చె నయ
భూషణశోభిత! కృష్ణభూవరా!

జయ జయ రాజశేఖర! వి శాల యశార్జిత ధర్మపాలనా!
జయ జయ ఆంధ్రభోజ! సువసంతఋతూత్సవ మోదదాయకా!
జయ జయ ఆంధ్రరాష్ట్రధవ! సత్కవికావ్య రమామనోహరా!
జయ జయ సర్వభూపనుత! శాత్రవభంజన కృష్ణభూవరా!

# చిత్రప్రశ్నలు

అఖల బ్రహ్మాండ భర్తయూ నాదిశక్తి
నతుల భుజశక్తి తన మూపునందు మోయు
వైనతేయుడు నలువది పలములగుచు
దనరు నదియెట్లు? విదుషీమ తల్లులార!

—చిల్కపాటి సీతాంబ.

అక్కతో గూడగలసిన ఆలుతోడ
నవని త్వరగల పెండ్లాము నతిముదమున
గాల్చుకొని వేడ్కదినదగు కాలమెద్ది?
సుంత వివరించి తెల్పు డోయింతులార!

—చిలకపాటి అమ్మణ్ణి.

# పువ్వులు-వాని ఉపయోగము



సామాన్యముగ స్త్రీలుధరించు పూవులు, వానిచెట్లు, అవి నివారించగల వ్యాధులు క్రింద వ్రాయుచుంటిని.

**గులాబి:**—గులాబిపువ్వు వాసన చూచుటవలన గుండెకాయకు బలముచేకూరును. జలుబుపోవును. దీనిరేఖలు సుమారొక డ్రాము ఎత్తు తినిన విరేచనములగును. దీనిరసమును ముక్కునందు పిండినచో తలనొప్పి నిమ్మళించును. ఎండు గులాబి పువ్వులుగాని, మొగ్గలుగాని నేతిలో దోరగావేయించి, భుజించునపుడు మొదటి ముద్దలోనుంచుకొని తినిన సుఖవిరేచనమగును.

**సంపెంగ:**—సంపెంగపూవుల కషాయము పొట్టలోని వాతమును వెడలించును. మూత్రము జారీచేయును. సెగరోగము పోగొట్టును. (మరుగుచున్న నీటిలో పువ్వులనువేసి, ఒక గంటయుంచి, వడపోసిన వచ్చుద్రవమే కషాయము.) సంపెంగ నూనె తలకు పూసికొనిన, తలనొప్పి, కండ్లజబ్బులు పోవును. మర్దన చేసిన ఎడల మేహవాతనొప్పులు మానగలవు. సంపెంగచెట్టుఆకు యొక్క పసరు తేనెతో కలిపి యిచ్చిన కడుపునొప్పి నివర్తించగలదు.

**చామంతి:**—చామంతిపూవులు తలయందుంచుకొనుటవలన నేత్రములకు చలువ జేయును. శిరోజములు బాగుగా పెరుగగలవు. వీని కషాయము, లేక చూర్ణము, తలత్రిప్పు, జ్వరము పోగొట్టును. శరీరమందలి దుష్టద్రవ కూటమిని కరగించును. నరములకు బలము చేకూర్చును. పొట్టయందలి వాతహరణమొనర్చును. ఋతుబద్ధమును పోనడచును. అజీర్ణశూలను శమింపజేయును. చామంతిచెట్టు వేరు యొక్క కషాయముగాని, ఆకు రసముగాని, ఎగశ్వాస, కఫము, మలమూత్ర బద్ధకము, మూలవ్యాధి, ఉబ్బురోగములను అణచును.

(కషాయపుమోతాదు_7, 8 తు॥. ఆకురసము మోతాదు-4, 5 తు॥)

**చంద్రకాంత:**—ప్రత్యేకించి చంద్రకాంత పూవుల ఉపయోగము లేదు. చంద్రకాంత చెట్టుఆకులకు ఆముదముద్రాసి, కొలదిగా వెచ్చచేసి సెగగడ్డలపైవేసి కట్టిన, అవి త్వరగా పగులును. చంద్రకాంతచెట్టు దుంప ఒకతులము, పావుతులము మిరియ

ములు కలిపినూరి మాత్రలుగా (ఏదినమునకాదినము) చేసికొని, 10 దినములపాటు సేవించిన ఎరుపు, తెలుపు, పసుపు సెగలుమానును. ఏరంగుసెగకు ఆరంగు పూవులుబూయు చెట్టుయొక్క దుంప నుపయోగించ వలెను.

మందార:—కొబ్బరి నూనెలో, నూనెకు సమముగా మందారపుష్పముల రసముపోసి, నీరు ఆవిరియైపోవునట్లు మరగగాచి మిగిలిన ద్రవమును తలనూనెగా వాడుచుండిన వెంట్రుకలెదుగును. రెండుమూడు పువ్వులు నేతిలో వేయించియిచ్చిన స్త్రీల ఋతు రక్తస్రావముగట్టును. ప్రతిదినము ఉదయము, ఒకటిరెండుపూవులు తినినచో, అనతి కాలములో కన్యలు ఋతుమతులగుదురు. మందారపువ్వును వేను కొరికినచోట రుద్దుచుండినచో, అదిమాసి వెంట్రుకలు తిరిగివచ్చును. మందారచెట్టుఆకుల రసము అనగా పసరు లోనికిచ్చినచో విరేచనము చేయును. మూత్ర బద్ధము నడచును.

మల్లి:—మల్లిపువ్వుల ధారణము కండ్లకు బలమిచ్చును. వెంట్రుకలకు మేలుచేయును గాని పేలు ఎక్కువగా పడును. వీనిని రెండుగుప్పిళ్లు చిదుగగొట్టి చన్నుపైన వేసి కట్టిన పాలు చేపురాకుండును. (రెండు మూడురోజులు, దినమునకు రెండు పర్యా యములు కట్టవలెను. చనుకుదురు అగునని తోచినపుడు ఇట్లు చేయవలెను.) మల్లిచెట్టుయొక్క ఆకులను కొలదిగ వేడిచేసి, నేత్రములపైవేసిన, నేత్రములు ఎరుపుగానుండుట మొదలగు నేత్రరోగములు, నిర్మూలించును.

మొగలి:—మొగలిపువ్వువాసన, కాక, కామవికారము కలుగజేయును. సమస్త వాత రోగములు, శ్లేష్మముహరించును. గుండెకు బలమిచ్చును.

నందివర్ధన:—నందివర్ధనపుష్పములు నేత్రముల కద్దుకొనిన చలువచేయును. నందివర్ధన చెట్టు పండుటాకులరసము కండ్లలోవేసిన కండ్ల కలకలు మానును.

పొగడ:—పొగడపువ్వులు తలయందు పెట్టుకొనుటవలన తలనొప్పి, శిరోవాతములు, నేత్రరోగములు హరింపబడును. పొగడచెట్టు చెక్కనుండి తీసినకషాయము పుక్కి లించినచో కదలెడు పండ్లు గట్టిపడును. చిగుళ్లరోగములు దంతరోగములు నశించును. దీనిచెక్కను చూర్ణముచేసి పుచ్చుకొనిన ఎడల సంతానయోగ్యతను పొందించును.

పొట్లూరి వెంకటేశ్వరరావు

# ముద్దు కృష్ణ



శ్రీరమాదేవి యురమున వెన్ను మీర
నిలచి కళ్యాణివై లోకముల స్మరింప
సందు చైతన్యమూర్తివై యలరు నీవు
బ్రోచి భావింప జేతువు ముద్దుకృష్ణ.

పాల మున్నీటి తెరగల పాపసాన్పు
రోసి వ్రేపల్లెనాడ విచ్చేసి పసుల
కొట్టములలోన వసియింప కోరినావు;
పూపబిడ్డవు గావున ముద్దుకృష్ణ.

పుట్టుటకు మున్నె బ్రహ్మయు, మునులు సురలు
వచ్చి నినుగూర్చి పొగడుచు వందనములు
సలిపినారలు నాకెట్లు సాధ్యమగును
పుణ్యపూరుష నిన్నెన్న ముద్దుకృష్ణ?

నాలుగు భుజాల తోడ విశాలనేత్ర
కమలముల తోడ శంఖచక్రముల తోడ
కౌస్తుభము తోడ జనియింప గలరె యొరులు?
భువనమోహన నీవలె ముద్దుకృష్ణ.

జోలపాడి యశోద ఉయ్యాల నూపి
వంగి నినుజూచి నిద్దురవచ్చె ననుచు
కదలిపో నీవు గ్రమ్మర కన్ను దెరచి
మోసగించెద వేలరా; ముద్దుకృష్ణ.

దేశిరాజు భారతీదేవి

# పాలు, పాలద్రవ్యములు

"రాము"



## పాల ఆహారపు విలువ

(గతసంచిక తరువాయి)

సరియైన ఆహారము (Balanced Diet) నకు అవసరమయిన మాంసకృత్తులు, క్రొవ్వులు, పిండిపదార్థములు, లవణములు, విటమిన్లు పాలలో యున్నవి. పిల్లలకిది మంచి ఆహారము. మేకపాలు వందు ఎముకల నిర్మాణమున కవసరమైన 'డి' విటమిను ఆవుపాలలోకంటె అధికముగానున్నది. ఆవు పాలకంటే మేకపాలు అధికముగా క్రొవ్వుల కలిగియున్నది. అందువలన దేహమునకు మేకపాలు ఆవు పాలకన్న శ్రేష్ఠమయినది. అంతేగాదు మేకపాలు ఆవుపాలవలె రోగముల వ్యాపింపచేయదు. ముఖ్యముగా క్షయవ్యాధిని నిరోధించును. మేకల పరిశుభ్రముగానుంచిన మేకపాలుగూడా ఏలాటి వాసన కలిగియుండదు. పాలలో నీరధికము కావున పెద్దవారికిది చాలదు. కాని బ్రెడ్డు (Bread), రొట్టె, బియ్యము, మొదలగువాటిని పాలలోవండి భుజించిన యెడల వాటి ఆహారపువిలువ ఇనుమడించును.

పాలు తెర్లించినపుడు దాని స్వభావమే వేరయిపోవును. దానిలోని పాలమడ్డి (Lactalbumen) నశించును. రుచి వేరగును. దాని ఆహారపు విలువకూడ మట్టును. అట్టిపాలు సులభముగా జీర్ణము కాదు. అట్టిపాలలో విటమినులుండవు. కాని, చెడు సూక్ష్మక్రిముల నాశముగావించుటకు రోగులకు, శిశువులకు ఇచ్చు పాలను బాగా తెర్లించియే ఈయవలెను. రోగములగూర్చి జాగ్రత పుచ్చుకొనునపుడు పాలు తెర్లింపనిదే త్రాగుట శ్రేయస్కరము గాదు.

## పాల పదార్థములు

గడ్డపాలు (Condensed Milk);—పాలలో చాలాభాగము నీరుతీసివేశిన పాలే గడ్డపాలు. దీనిలో చక్కెర కలిపియుంచెదరు. మంచి క్రొత్తపాలు 80°c వరకు కాచి, చక్కెరకలిపి, ఆవిరి పాత్రలో చిక్కగా నగునంతవరకు ఇగుర బెట్టెదరు. తర్వాత చల్లార్చి డబ్బాలలోనింపి మూతవేయుదురు. గడ్డపాలు పరిశుభ్రమై క్షయ మొదలుగాగల వ్యాధుల క్రిములేవియు చేరనివ్వదు. చక్కెరవేసిన గడ్డపాలు శిశువునకు చెడ్డది. దానిలోని చక్కెర శిశువుకు చాల అధికము. తీపి తక్కువచేయుటకు గడ్డపాలకు నీరుకలిపిన నది క్రొవ్వులయందు లోపించును. అందువల్ల గడ్డపాలు సామాన్య శిశువులకు అంత మంచిదికాదు.

పాలపొడి (Powder Milk) :—పాలను పూర్తిగా జలహీనము చేసినయెడల పొడిమిగులును. పాలపొడి మంచిపాలకు ప్రత్యామ్నాయము కానేరదు. ఇదినీటిలో పూర్తిగాకరుగదు. బాగా తెర్లించినయెడల ఒకవిధమయిన వాసనవచ్చును. పొడినుండి చేసిన పాలరుచియే వేరు. కాని ఇది ఆవుపాల కన్న సులభముగా జీర్ణమగును, అందువలన ఇది గడ్డపాలుకన్న శిశువులకు శ్రేయస్కరమైనది.

పాలపొడి కొన్ని ఆహారపదార్థములు, తినుబండారములు, పాల బిస్కత్తులు, పాల చాకలేట్లు, మిఠాయి వస్తువులు మొదలగునవి చేయుటయందు విరివిగా వాడబడుచున్నది.

జున్ను (Cheese):—దీనిని తయారు చేయుటకు పాలనుకాచి విరిగిపోవునట్లు చేసెదరు. వచ్చిన పెరుగును గూడా నాలుగైదుసార్లు విరుగునట్లుజేసి, తర్వాత బట్టలలోచుట్టి వే (Whey) అంతయు పిండివేసెదరు. ఈ గట్టిపదార్థమే జున్ను.

జున్నులో ముఖ్యముగా కేసీనే మాంసకృత్తు, క్రొవ్వు, నీరు, చక్కెర, లవణములు ఉన్నవి. దీనిని నేడు కేసీను తయారుచేయుటకు పారిశ్రామికముగా వాడుచున్నారు.

వెన్న (Butter) :—మీగడ పెరుగును బాగా చిలికినపుడు దానిలోని క్రొవ్వంతయు ముద్దగా నేర్పడును. ఈ ముద్దయే వెన్న. ఇతరదేశములలో మేలురకపు వెన్న తయారుచేయుటకు ప్రత్యేకముగా మంచిరకముల క్షీరామ్ల సూక్ష్మజీవుల (Lactic Acid Bacilli) పెంచి, వాటితో మీగడను పులియ చేసెదరు. అందువలననే మనదేశమునకు దిగుమతియగు డబ్బివెన్న మంచిరంగు, వాసన కలిగియుండుట.

వెన్నలో నూటికి 85 పాళ్లు క్రొవ్వు, 12 లేక 15 పాళ్లు నీరు ఉండును. వీటికి తోడుగా పాలు, క్షీరామ్లము, కేసీను స్వల్పముగా నుండును. వెన్నలో కేసీను ఎక్కువగానుండిన వెన్న శీఘ్రముగా చెడిపోవును. అందులకు సాధ్యమయినంతవరకు కేసీనును విడదీయుదురు. వెన్న అధికకాలము మనుటకు ఉప్పుకలిపి యుంచెదరు. మంచివెన్న నూకలు నూకలుగానుండి, మంచి పరిమళయుతమై తెలుపులేక పసుపురంగు కలిగియుండును.

నేయి (Ghee):—వెన్న కరగించినదే నేయి. వెన్నకరిగించినపుడు, నీరు, పెరుగు, ఉప్పు, అసలు క్రొవ్వునుండి వేరగును. అందువలన నేయి అచ్చమయిన క్రొవ్వు.

నేయి, వెన్న, 'ఏ' 'డి' విటమినుల కలిగియున్నవి. అవి శరీరమునకు వేడియొసంగి, పుష్టినిచ్చును. దేహము నిగనిగలాడునట్లు చేసి అందమిచ్చును.

నూనెలకంటే చక్కని నేయి శ్రేష్ఠమయినది. ఏలననగా నేయి పాలవలె సులభముగా జీర్ణమగును. కాని కృత్రిమపునేయి (Artificial Ghee) దేహము నందజీర్ణము, పైత్యము కలిగించును. నేతికి సమాన మయిన వనస్పతిని శాస్త్రజ్ఞులింకను తయారుచేయలేదు. తైలరసాయనికులు (Oil Chemists) దీనిని గూర్చి నిరంతర పరిశోధన సల్పుచున్నారు. వారిపరిశోధన సఫలమగునంతవరకు నేటి ఉదజనీకృత (Hydrogenated Oils) తైలములయిన వనస్పతుల వాడుటకుమారుగా నూనెలనే వాడుట ఉత్తమము.

మనదేశములో ప్రపంచములో మూడవవంతు పశువులున్నవి. మన దేశములోని ఆవులసంఖ్య అమెరికాదేశములో ఆవులసంఖ్యకు నాల్గురెట్లు. కాని అమెరికాలో లభించు పాలలో సగమే మనకు లభించుచున్నది. కారణము మనదేశములో పశువులకు తిండిలేదు. పశువులమేతకు ప్రత్యేకముగా గడ్డి పెంచబడు భూములితరదేశములలో నున్నట్లు మనదేశములో లేదు. మనదేశములో 18 కోట్ల పశువులకు చాలిన తిండి ఇవ్వలేము. ఇతరదేశములలో రోగిష్ఠియయిన, పనికిరాని పశువుల చంపివేయుదురు. మనము స్వతహాగా చంపముగాని, వాటికి తిండి ఇవ్వలేనందువలన, అవే మలమల మాడి కృశించి చచ్చిపోవును.

మనదేశములో కృశించిపోయిన, రోగములకు గురియయిన పశువుల విసర్జించి, ఉన్నవాటికి పుష్ఠియయిన ఆహారములో పోషించవలెను. తర్వాత పశువునుండి పాలు, చేతితోగాక యంత్రముల సహాయముననే సేకరించి రోగక్రిములు చేరకుండ శుభ్రపరచవలెను. విదేశములలో పాలు పితికినవెంటనే క్షయవ్యాధిక్రిములు ఏమియులేకుండునట్లు పరీక్ష గావించెదరు. వెంటనే పాలు చల్లగాచేసి సీసాలలో భద్రముగా యంత్రసహాయముతో పోసి మూతవేయుదురు. ఈ సీసాలు కొనువారికివ్వబడును. ఇట్టి జాగ్రత్తలేవీ మనదేశములో తీసికొనబడవు. ఇకనైన ఆరోగ్య, ఆహారశాఖల మంత్రులు మన జాతికి అభ్యుదయము కలిగించు దృష్టితో, గోమాతను సంరక్షించి దేశమునకు శుభము కలిగింతురుగాక!

———:o:———

# కృష్ణాజి శేక కృష్ణమాంబ

**శ్రీ నిడదవోలు వేంకటరావుగారు ఎం. ఏ.**

వెనుక వివరించిన రామభద్రాంబను గూర్చినపద్యమున "కృష్ణాజి" ప్రశంసగలదు. కృష్ణాజీయు రామభద్రాంబవలెనే, కాళకవివద్ద కవిత్వము నేర్చినది. ఈమె విజయరాఘవ నాయకుని కాలమున విలసిల్లినది. ఈమె రచించిన గ్రంథములును లభ్యముకాలేదు. కాళకవి 'రాజగోపాలవిలాసమున' నీమె ప్రజ్ఞావిశేషముల నిట్లు వర్ణించినాడు.

ప్రస్తారసంఖ్యను పదమూఁడుకోటులు
నలువది రెండులక్షలు బదేను
వేలు నేన్నూరును వింశతియును నాలు
వృత్తంబులందు నీ వృత్తమునకు
నీ వర్ణన సమస్య నీవు గూర్పుమటన్న
నా వృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకము లాశువుఁగా జెప్పి
యవి తెనుంగుసను పద్యములుచేసి

యిరువదాఱును ఛందంబులెఱిగి యిట్లు
కవిత చెప్పినవార లీభువిని గలరె
యనుచు నందఱు వినుతింప ఘనతగాంచె
కీర్తనీయ గుణాలంబ! కృష్ణమాంబ.

కృష్ణమాంబ ఛందశ్శాస్త్రమున మిక్కిలి ప్రవీణురాలనియు, నే వర్ణన యిచ్చి సమస్య పూరింపు మన్న పూరించుశక్తి గలది యనియు, నది శ్లోకములుగా ననువదించుటచే, సంస్కృత కవయిత్రియనియు, నాశుకవిత్వమునగూడ కడుసమర్థురాలనియు తెలియు చున్నది. ఈమె గ్రంథములు లభింపకబోవుట మన దురదృష్టము.

# భాగ్యవంతుల బాహ్యచిహ్నాలు

శ్రీమతి టి. వి. రత్నావళిగారు

"ప్రభూ! ప్రభూ!" అని పిలచి యెక్కడ కనబడనందున, సర్వసాధారణంగా మేడమీద వరండాలో ప్రభూ కూర్చోడం అలవాటు గాబట్టి గబగబా అక్కడికి వెళ్లాడు, ప్రసాదం, ఆఫీసునుండి రాగానేను. "ఏమిటి ప్రభూ! అస్తమానం ఆ వరండాలోనే కూర్చుంటున్నావు, ఆ యెదిరింటి వార్నిజూస్తూను. ఆఖరికి నీకు పిచ్చెత్తేటట్లుంది." అన్నాడు ప్రసాదరావు భార్యతో.

"నిజమేనండీ నాకు పిచ్చెత్తేటట్లే యున్నది. ఇప్పుడే కారు చప్పుడైతేను వాళ్లను చూద్దామని వచ్చాను అయినా చూడండీ, మీతో సమాన ఉద్యోగస్తుడేకదా! వాళ్లేలా గొప్పగా యుంటారో ను. ఈ ఊరువచ్చి మూడు నెలలు కాలేదు కారు కొనేశాడు" అంటూ అతని మామూలు బట్టలు కట్టుకుందుకుయిచ్చి, ఆఫీసుడ్రెస్సు స్టాండుకి వేసింది.

"ఏమిటే, నీకు కారు కావాలా, ఉండు, ఇప్పుడే బజారుకు వెళ్లి, మంచి పట్టు కారు, పట్టు కొస్తాను. నువ్వు చెయ్యి కాల్చుకోకుండా వండడానికి" అన్నాడు వెటకారంగా.

"ఎందుకంత వెటకారం, చెయ్యి కాల్చుకుంటానని, పట్టుకారు కొంటూ ననకపోతే మీ స్నేహితుడులాగే, ఒక వంట మనిషిని పెడతాననగూడదు" అంటూ కాఫీ, టిఫెను తెచ్చి ముందర పెట్టి, వంటకు వెళ్లింది. ఆ టిఫెను తినివేసి షికారు వెళ్లిపోయాడు ప్రసాదరావు.

ప్రసాదరావు యింటికి వచ్చేటప్పటికి రాత్రి 8 అయింది. "ఏమిటండీ ఆ కట్టుకున్న పంచ అలా పాడైంది" అంది ప్రభు.

"ఏమిలేదూ, నేను బయటకు వెళ్లగానే వర్షము వచ్చింది తెలుసా? బీచినుంచి నడచి వస్తూంటే, మన యెదురింటి భాగ్యదంపతులు, నా ప్రక్కనుండి కారులో వెళ్లిపోతూ, నా మీద ఆ దుమ్ము నీరంతా కొట్టేశారు. ఆ భాగ్యవంతుల బాహ్యచిహ్నాలివి." అన్నాడు నవ్వుతూను

"బాగుంది, బాహ్యచిహ్నాలేమిటి? ఎందుకంత వెటకారం. అసలు నిజంగా భాగ్యవంతులు కాకపోతే, అలా బంగళలోనుండి, కారు కొనగలరా! ఏ సినిమా వచ్చినా, మొదటి వారమే ఫస్టుక్లాసుకు, వెడతారు. మనం అలాగ వెడుతున్నామా?" యని చిన్నబుచ్చుకుంది ప్రభు. "పిచ్చిదాన, అంత ఎత్తు ఎప్పుడు, ఎత్తకూడదు, మనిషి నిమిషంలో కూలిపోతాడు. నాతో సమాన ఉద్యోగస్తుడైనా వాడేమీ అంత భాగ్యవంతుడు కాడు. మా చెల్లి అత్తగారి ఊరే వారి దీని. భార్య భాగ్యవంతురాలైగా యుండవచ్చును." అన్నాడు భార్యకేసి చూస్తూను. "ఔను, పాపం అస్తమానం మా వాళ్లు పెట్టలేదనే కదూ, నన్ను దెప్పడం" అని ప్రభు అంటూండగా భోజనానికి, వెళ్లిపోయారు. ఎదురింటి రవణారావుది, అసలు కోనసీమ, గానీ. అతను చదువు రీత్యా ఎప్పుడూ, రాజమండ్రిలోనే, పెరిగేడు, వాళ్లు ఎక్కువ భాగ్యవంతులు కాకపోయినా, కూడు, గుడ్డల కెంతమాత్రం, లోటులేదుగానీ, అతనెప్పుడూ,

చాలాదర్జాగా నుండాలనే ప్రయత్నించేవాడు. ఉత్తడాబులరాయుడు. అతని, డాబులకు మోస పోయి భాగ్యవంతులతనికి, పిల్లనిచ్చేరు.

అతనికి అప్పుడే మద్రాసులో పని అయింది. క్రొత్తగా భార్య కాపురానికి రావడంగూడా, అప్పుడే కాబట్టి, అతను, చాలాదర్జాగానుండాలని, తన జీతం 100 రూపాయలైనా, చాలదర్జాగా ఖర్చు చేసేవాడు. గొప్ప యింటిబిడ్డ కాపురానికి వస్తుందని, ఉద్యోగం అనగానే, ఒక చిన్న బంగళా, అద్దెకు తీసుకున్నాడు. నిత్యం రెండుపూటలా వాడకుండా, పూలుకొనేవాడు. భార్యస్నేహితులకి, తన స్నేహితులకి, నిత్యం యింట్లో, టీ పార్టీలు జరుగుతూ యుండేవి.

సాయంత్రం 4 ఘంట లయేసరికి చేతిలో బేట్లు తీసుకొని, అయ్యగారు, టెన్నిసుకోర్టుకు, అమ్మగారు లేడీసు క్లబ్బుకి. కొన్నాళ్లకు లేడీసు క్లబ్బులో ప్రభావతమ్మకు రమణారావు భార్య రమణాలకు స్నేహమైంది. గొప్ప వాళ్లతో స్నేహం చెయ్యాలని, ప్రభావతమ్మ, ఎటులనో భర్తను వప్పించి, క్లబ్బులో మెంబరుగా చేరింది. ఆమె సరదాతీరింది.

రమణాలు పల్లెటూరి పిల్లయైనా, చాలా టెంపర్ గా యుండేది. తను ఒక చిన్న పల్లెటూరి నుంచి, యేకంగా మెడ్రాసు రావడంతోటే, మరీ కళ్లు నెత్తికొచ్చేయి. తన స్నేహితులతోటి, భర్త స్నేహితులతోటి కలసి మెలసి సోషల్ గా యుండడమే మద్రాసు ఫేషన్ అనుకున్నది. అది సెంట్రలు స్టేషన్, మహిమలెండి. వారానికొక క్రొత్త నగ చేయించుకుంటూండేది, తన పెళ్లికి పెట్టిన కాసుల మాల మెడ్రాసు వచ్చాక ఆమెకు నాజూకు కాలేదు. అది చెరిపించి, నెక్ లెస్ చేయించుకుంది. వడ్డాణం చెరిపించి రవ్వల దుద్దులు చేయించుకుంది. వారానికొకరకం, ఫేషను చీరలు కొనేది. రమణారావుకి, బలేఛాన్సు దొరికింది. సగానికి సగం, రెండింటిలోను కమీషన్ కొట్టి నాటకం జరిపిస్తున్నాడు.

రమణారావు ఎంత డాబులరాయుడో, ప్రసాదరావు అంత నిరాడంబరజీవి. గొప్ప మేధావీను. రమణారావుతో సమాన ఉద్యోగస్తుడైనప్పటికిని, ఆ జీతంతోటే కాలక్షేపంచేసి, మిగల్చుకోవాలని తంటాలు పడేవాడు. తనకుగాని, భార్యకుగాని, అతిథి అభ్యాగతులకుగాని గౌరవ మర్యాదులలో లోటులేకుండా సంసారయాత్ర గడిపేవాడు.

ప్రభావతి, భర్తకు అనుగుణ్యముగా నడుస్తూన్నకాస్త ఆ భాగ్యవంతుల బాహ్యచిహ్నములు చూస్తే, అప్పుడప్పుడు కొంచెము మనస్సు చలిస్తూండేది. తమ రెండుకు అంత గొప్పగాను, దర్జాగాను యుండగూడదని.కాని ప్రసాదరావుకి తన భార్యకు వాళ్ల పిచ్చి ఎక్కడ అంటుకుంటుందో యని భయపడేవాడు. అప్పుడే క్లబ్బునుండి వచ్చింది ప్రభావతమ్మ. "ఏమిటే క్లబ్బు విశేషాలు" అన్నాడు ప్రసాదరావు భార్యతో.

"అస్తమానం మా ఆడవాళ్లను తిడుతూ యెందుకు మా క్లబ్బుమాట అడుగుతారు" అంది ప్రభావతమ్మ.

"అంటే, మీ ఆడవాళ్ల క్లబ్బులో చాలా చాలా వింతలు, విశేషాలు ఎక్కువగా యుంటాయిగనక."

"ఔను పాపం మామీదేమీధ్వజం. కానీ, ఈ వేళే రమణాలు, మంచి నెక్ లెస్ రవ్వల దుద్దులు కొనుక్కున్నది. చాలా బాగున్నాయి" అంది.

"అసలు బంగారమేనా ? లేక రోల్డుగోల్డువా ?"

"ఆ చాల్లెండి మీ మాటలు మీరూను, మీరు చేయించలేరుగాని, అందర్ని అలాగే అంటారు. మీ కెందుకంత మత్సరం. ఒకళ్లు చేయించుకొంటేను. అసలు నేను క్లబ్బుకి వెళ్లడమే మీ కిష్టములేదు. మిమ్మల్ని కొరుక్కుని తిని ముఖ్య

ముగా ఇటువంటివన్ని చూద్దామనే ఈ క్లబ్బులో చేరేను.” “అయితే నీకు నెక్లేస్ కావాలంటావా ?”

“మరే, రేపే చేయించేస్తా”రని అంది, ఉక్రోషంతో. “వెర్రిపిల్ల! చూడు స్త్రీలకు శీలమే గొప్ప భూషణం. అంతకంటే ఏంకావాలా ? సతికి పతే గొప్ప నగ. నీవు క్లబ్బుకు వెళ్లి తెలుసుకున్న దేమిటంటే, నగలు చేయించుకోవడం - అన్న మాట. అంతేనా ?”

“చాల్లెండి యింతేగా మీ మొగాళ్ల గొప్పతనం. మమ్మల్నిమించి ప్రపంచకమే లేదంటారు. దేవుడే లేడు. అంతా మేమే మంటారు. మీదంతా స్వార్థమేను.”

“అయితే రవణారావు లాగున ఊరంతా అప్పులుచేసి నీకు నగలు చేయించమంటావా ?”

“నిజంగా అప్పులేచేస్తేనేం, చూడండి, మరో రకం కారు. ఈ నెలాఖరున కొన్నాడు మళ్లీను” అంది.

“వాడు అసలు కారు కొనాలేదు, యేమిలేదు. కారు కొంటానని ప్రతి కంపెనీ వాళ్లని అడుగుతే, ముందు ఒక నెల డ్రైవరుతో సహా, వాళ్లు కారు వాడుకొనేందుకు ఇస్తారు. అలాగే ప్రతి కంపెనీకి వెళ్లి, నెలకో కారు, తెస్తున్నాడు. అదీ వాడి మాయ. అద్దివాడు అద్ది అడుగుతే, ఇదుగో చెక్కు మారుస్తా నంటాడు. అంతా ఉత్తదే నిన్న కంపెనీ వాళ్లు, ఇంటివాళ్లు ఒకటే గోల.” అంటూండగా తలుపు చప్పుడైంది. తలుపు తియ్యగానే, కార్లో నుంచి, ఆ భాగ్య దంపతులు అప్పుడే సినిమాకు వెడుతూ ఇక్కడ దిగారు. ప్రసాదరావుకి, ప్రభావతమ్మకు చాల ఆశ్చర్యమేసింది. దంపతులను ఆహ్వానించారుగాని, రవణాలు, గబగబా ప్రభువుని లోపలికి తీసుకొనివెళ్లి ఏమండీ ఒక్క 15 రూపాయలుంటే ఇస్తురు. ఇంటి నిండా చుట్టాలు వచ్చారు. రేపు ప్రొద్దుటేగాని, బ్యాంకు తెరవరు. తెరవగానే తెచ్చి ఇస్తాను” అని అడిగింది.

రవణాలు కారుతో, మనింటికి వచ్చిందే పది వేలు. ఇంక ఆమె సొమ్ము అడిగితే ఇంకేముంది, ఆమె భాగ్యమునకు మోహితయై వెంటనే 15 రూపాయలు ఇచ్చింది ప్రభు భర్త ప్రసాదరావు పళ్లుకొరకుతున్నాడుగాని, ప్రభావతమ్మ లక్ష్యపెట్టక రూపాయలిచ్చింది. అవి తీసుకొని, ఆ భాగ్య దంపతులు వెళ్లిపోయారు.

“అయిందాక్షారం! నెక్లెస్ చేయించుకుందని పొంగవుగదూ! అనుభవించు” కోపావేశంతో వెళ్లి పడుకున్నాడు ప్రసాదం. సొమ్ముపోయి దిమ్మపట్టిందని, చేసినపనికి విచారిస్తు, వెళ్లి పడుకుంది ప్రభావతమ్మ.

తెల్లవారింది, ప్రసాదం కాఫీత్రాగి కూరలుతెచ్చి యింట్లో పడేసి పేపరు చదువుతూ, ఈజి చైరులో కూర్చున్నాడు. వంటలో మునిగిపోయింది ప్రభావతి. వీధిలో ఏవో కేకలు వినిపించాయి. పేపరు పడేసి వరండాలోకి వచ్చాడు ప్రసాదరావు. ఇంకేముంది, భాగ్యవంతుల యెదురిల్లు తాళం, ఇల్లుగల మనిషివచ్చి ఆర్నెల్లబట్టి అద్ది ఇవ్వలేదని, లబో, లబో అని మొత్తుకుంటున్నాడు. ఇది విని వీధిలో అప్పుల వాళ్లందరువచ్చి పడ్డారు బట్టలషాపువాళ్ల 500, పాలవాళ్ల 100, అంతా అప్పులే. అంతా అప్పులే.

వంట అయిపోయింది, భర్త యింకా భోజనానికి రాలేదని పిలవడానికి వచ్చింది ప్రభావతి. “ఈ గోలంతా ఏమిటండీ! అయ్యో వాళ్లిల్లు తాళం వేశారే”మంది.

“అచ్చే యేమిలేదు. అదంతా భాగ్యవంతుల బాహ్య చిహ్నలు” అన్నాడు ప్రసాదం.

“ఇప్పటికేనా నమ్ముతావా ? నీకు నెక్లెస్ చేయించనా ? కారు కావాలనా? ”అని వేళంకోళం చేసేడు.

“ఆఁ ఆఁ” అంటూ తలవంచుకొని లోపలికి వెళ్లిపోయింది ప్రభావతి.

---



# రీటా తలవెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగపనిచేయును. వేనకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

రీటా ప్రతి-చోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

లలితాపావర్ : ఉత్తమమైన హెయిర్‌టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

సుశీల్‌కుమార్ : రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

కన్నాంబ : రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

పుష్పవల్లి : నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము.

సూర్యకుమారి: రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

కృష్ణవేణి: రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

ఆర్. పద్మ: నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

లక్ష్మీబాయి: తలవెంట్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

వసుంధరాదేవి: శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

రాజమ్మ : శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# గృహలక్ష్మికి పద్యరత్నాలు



శ్రీయుత కల్లూరు - అహోబలరావుగారు

(జూన్ సంచిక తరువాత)

పూదోటఁ బెంచ నేర్వుము సాదరమున నీరుబోసి చతురిమ మెఱయన్
లేదనక వలయు పూవుల మోదమున బరిగ్రహింపు మో గృహలక్ష్మీ!

కమ్మని తెమ్మెర వీవఁగ గుమ్మను వాసనలు దివ్యకుతుకంబెసగన్
నెమ్మేను పులకరింపగ నిమ్ముగదా! వనసుఖమ్ము లిల గృహలక్ష్మీ!

మల్లెలు మొల్లలు జాజులు గొల్లలుగాఁ గూర్చి, దేశిఁ గోరి భరింపన్
యుల్లము రంజిల్లదె? నీకెల్ల చదువు లబ్బకుండునే? గృహలక్ష్మీ!

చెలువగు పూదండలతోఁ జెలులకుఁ దల్లికిని, యక్క చెల్లెండ్రకు, నీ
కళలుట్టిపడఁగ జడముడు లలరఁగఁ గూర్పంగ, ముదములౌ! గృహలక్ష్మీ!

పనులలో గొప్పచిన్నవి యనబోకుము? పాచిపనుల నాదిగ నిలలో
ఘనమగు పనులన్నింటిని వనితలు నేర్వంగవలయు వర గృహలక్ష్మీ!

పచనకళఁ దెలిసియుండుము శుచిరుచిగల వంటకములె శుభ్రఖ్యాతుల్
రచియించి తెచ్చు; మంగళవచనము నీ కెపుడుఁ గల్గు వర గృహలక్ష్మీ!

తెలియనిపనులన్ దల్లిని మెలకువతో నడిగి నీవు మేటిగ వానిన్
దెలిసికొనవలయు నావల విలపించిన ఫలము లేదు; విను గృహలక్ష్మీ!

పుట్టింట నేర్వకుండిన మెట్టిన గృహమునను పనులు మించి భరంబౌ
దట్టింతు రత్తమామలు పట్టే! తలవంపులగును; వర గృహలక్ష్మీ!

'సినిమా' లకు, 'పార్టీ' లకుఁ జనఁ బోకుము మాఱుమాఱు జతగలదంచున్
గొనములు స్వల్పంబందుల ఘనములు చెడునడతలరయ ఘన గృహలక్ష్మీ!

'టాకీ' ప్రభువులు కొందఱు శోకులకై మఱిగి వారి 'షో' రూములలోఁ
గోకిలవాణుల శీలము గాకుల పాల్సేతురకట! ఘన గృహలక్ష్మీ!

స్త్రీలకు మానము ప్రాణము స్త్రీలకు శీలంబె సౌఖ్యసిద్ధుల నొసగున్
శీలము విడు, పడఁతులకహ! శూలపు మరణము లెసేలు; శుభగృహలక్ష్మీ!

విజ్ఞానార్జన మొసఁగని యజ్ఞాన మడంపలేని యాటాకీలన్
ప్రాజ్ఞులు హర్షింపరు; ఈ సుజ్ఞానము దెలిసికొమ్ము; శుభగృహలక్ష్మీ!



(సశేషము)

# కమల కాపురం

ఆర్. జనాబాయి

మాలతి రాట్నం బెట్టుకొని దారముతీస్తూ, "రఘుపతి రాఘవ రాజారాం-పతితపావన సీతారాం" అని గొణుక్కుంటూ కూర్చుంది. మాలతికి పిల్లలు లేరు. అందుకని పనిగూడాలేదు. ఇంతలో కమల అక్కయ్యా! ఏంచేస్తున్నావనుకుంటూ వచ్చింది.

మాలతి:—దారం తీస్తున్నాను.

కమల:—అక్కయ్యా! నీ పని మంచిపని. పిల్లల్తో నాకు తీరికేవుండదు. ఏం చెయ్యను? ఇవ్వాళ్ల పిల్లలు మా అమ్మ యింటికి వెళ్ళారు. నా పనీ కొంచెం తెమిలింది. కాస్సేపు నీ దగ్గర కాలక్షేపం చేద్దామని వచ్చాను. ఈ దారంతో యేంచేస్తా వక్కయ్యా!

మాలతి:—బట్టలు నేయించుకుంటారు. గాంధీమహాత్ముడు 'నిర్మాణకార్యక్రమము' అనే పుస్తకం వ్రాశాడు. దాన్ని చదివితే అన్ని విషయాలూ తెలుస్తై. కాని, కమలా! నీవు చాలా చిక్కిపోతున్నా వెందుకమ్మా!

కమల:—ఏం చెయ్యనక్కయ్యా! మాకు జీతం సరిపోదు. భోజనానికుంటే, గుడ్డకుండదు. గుడ్డ కుంటే భోజనానికుండదు. అక్కయ్యా! మరోమాట.

మాలతి:—ఏమిటి కమలా చెప్పు! నీకేం సహాయం కావాలి? నా చేతనైతే తప్పక చేస్తాను.

కమల:—అక్కయ్యా! నా కిరవై రూపాయలుంటే యివ్వు. చీర కొనుక్కుంటాను. నెలకు రెండు రూపాయల చొప్పున నీ అప్పు తీరుస్తాను.

మాలతి:—(కొంచెంసేపు ఆలోచించి) కమలా! నే నొకమాట చెప్తాను. కోపగించుకోకు. పది నెలలు నాకు డబ్బు చెల్లించేదాని కంటే రోజుకు రెండు గంటలు దారం తీయటం కోసం వినియోగించావా పది నెలల్లో నీకు అయిదు చీరెలు తయారౌతవి. ఆ మిల్లు చీర కొంటే నాకు డబ్బు చెల్లించినన్ని రోజులైనా ఆగదు చెల్లీ!

కమల:—మరేం చెయ్యమంటా వక్కయ్యా! నా దగ్గర రాట్నంలేదు. అదీగాక, నాకు దారం తీయటం గూడా రాదు.

మాలతి:—అయితే. నే చెప్పినట్లుచేయి. రోజూ మధ్యాహ్నం ఒంటి గంటకు నా దగ్గరికివచ్చి మూడు గంటల వరకూ రాట్నం వడుకు. రాట్నం నే నిస్తాను. రెండు నెలలలో రెండురూపాయల మూదితో నీకు యిరువై రూపాయల చక్కని చీరె యిప్పిస్తాను.

కమల:—మంచి దక్కయ్యా! తప్పక వస్తాను.

ఆవిధంగా కమల రోజూ మధ్యాహ్నం మాలతి యింటికివచ్చి దారం తీస్తుండేది. ఇలా రెండు నెలలు గడిచినై. కమల తీసిన దారంతోనే ఒక చీరె, ఒక ధోవతుల జతా మాలతి యిప్పించింది. మరునాడు సంవత్సరాది పండుగకు కొత్త చీర యిప్పించ లేనన్నాడు కమల భర్త. చీరెవెల 20 రూపాయల్ల కంటే తక్కువలేదు. కమల భర్త రామారావు. లలితా మోహనులు కమల సంతానం.

రామారావు:—కమలా! నా దగ్గర యిరవై రూపాయలే ఉన్నై. వాటితో పిల్లలకు బట్టలు తెస్తాను. మనకు బట్టలేక పోయినా చింతలేదు. ఉన్నవే కట్టుకుందాం. పిల్లలూరుకోరుగా మరి? తోటి పిల్లలనుచూచి మారాం చేస్తారు. సరే నేను బజారుకు వెళ్తాను.

కమల:—మంచిది టీ త్రాగి వెళ్ళండి. నాలుగు గంటలైంది.

రామారావు:-సాయంత్రమైపోయింది. మరి యెపుడు చేస్తావు? పగటినిద్ర వద్దంటే వినవు. తీరా నేను నాలుగు గంటలకు వచ్చేటప్పటికి టీ తొందర.

కమల;-నేను పగటి నిద్రమాని నాలుగు నెలలైంది.

రామారావు:—మరి పగలంతా ఏంచేస్తున్నావు? ఇరుగు పొరుగుతో ముచ్చటలేగదూ! ఇంతకంటే నీవు చేసే పనేముంది? రేపే పండుగ. రేపటి వఱకు దర్జీవాడు గుడ్డలు కుట్టి యివ్వడు. కుట్టినవే కొనుక్కొస్తాను.

కమల:—మంచిది. అని కాఫీ కప్పు చేతి కందించును.

రామారావు బజారుకు వెళ్లాడు. వాళ్ల నాన్న కొత్త బట్టలు తెస్తాడని లలితా మోహనులు సంతోషంతో ఆడుకుంటున్నారు. కమల వంట యింట్లో కూర్చొని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది. ఇంకా వీరు నన్ను పాత కమలనే అనుకుంటున్నారు. కమల మారిన సంగతి వారికేం తెలుసు? పాపం! పగల్లా నేను పడుకుంటున్నాననో, ముచ్చటలు పెట్టుకుంటాననో వారి ఉద్దేశం. కలలోగూడా నేను మంచిపని చేస్తున్నానంటే నమ్మరు. ఇంతలో తొమ్మిది గంటలైంది. రామారావు కాగితములో చుట్టిన కొన్ని గుడ్డలను కమల ముందు పడవేశాడు.

రామారావు:—అబ్బ! అలసిపోయాను. బట్టలు చాలా ప్రియంగావున్నై. ఏ కొట్టులోకి వెళ్లినా ఒకటే ధర!

పాపం పిల్లలు నాన్న వస్తాడు కొత్త బట్టలు తెస్తాడు, అని కూర్చొని, కూర్చొని అప్పుడే పడుకున్నారు.

రామారావు:—పిల్లల గుడ్డలకు పదిహేను రూపాయలైనై. పండుగ ఖర్చుకు యీ అయిదు రూపాయలూ వాడుకొమ్మని కమల చేతిలో పెట్టాడు.

కమల:—మంచిది భోంచెయ్యండి.

రామారావు:—పిల్లలు భోంచేశారా?

కమల:—రెండు మెతుకులుతిని యిప్పుడే పడుకున్నారు.

ఇద్దరూ భోంచేశారు. రామారావు పడుకున్నాడు. కమల వంటయిల్లు సర్ది తానుగూడా పడుకోడానికి వెళ్లింది. రామారావింకా నిద్రపోలేదు. ఏదో ఆలోచిస్తూ పడుకున్నాడు.

కమల:—(దగ్గరికివచ్చి) ఏం ఆలోచిస్తున్నారండీ?

రామా:—ఇంకా నిద్ర రావటంలేదు కమలా! నావంటి దరిద్రుని భార్యవై నీవెంత కష్టపడుతున్నావో ఆలోచిస్తున్నాను.

కమల:—రామరామ! ఎంత మాటన్నారండీ. ఇప్పుడు మనకేం కష్టం జరుగుతుందండీ! ప్రపంచంలో మనకంటే కష్టపడే వారెందరులేరు? భగవంతుడు మనకేం తక్కువచేశాడు? జీవితం గడుపుకోవడానికి కొద్దో, గొప్పో జీతం. ఆత్మశాంతికి వజ్రాలలాంటి యిద్దరు పిల్లలు. ఇక తక్కువేమిటో నాకు చెప్పండి?

రామా:—అయితే ఏం! పండుగకు పట్టుమని పదిరూపాయలుబెట్టి ఒక చీరైనా కొనుక్కురాలేని దౌర్భాగ్యుణ్ణి కమలా నేను?

కమల:—ఓహో? అదా మీ కిప్పుడు విచారం? అయితే నా దగ్గర చీర, ధోవతుల జత యెప్పుడో తయారై ఉన్నై. ఇదిగో చూపిస్తా నుండండి, అంటూ, లోపలికివెళ్ళి, ఒక నీలిరంగు చీరా, గులాబిరంగు జాకెట్టూ, ఒక ధోవతులజతా భర్తచేతి కందించింది. అది చూచి రామారావు నివ్వెరపడి కమలా! ఇవెక్కడినుంచి తెచ్చావు? కొంపముంచి అప్పుచేయలేదుగదా!

కమల:—లేదండీ. రోజూ దారంతీస్తూ, నేను ఆ దారంతో తయారుచేసిన బట్టలివి? వీనికై నాలుగు నెలలు కష్టపడ్డాను.

రామా:—నీకు రాట్నం ఎక్కడిది?

కమల:—మాలతి అక్కయ్య యిచ్చిందండీ. దారం తీయటంగూడా ఆమే నేర్పింది. ఇది ఆమె అనుగ్రహమండీ.

రామా:—అయితే, నీవు చాలా మంచి పనిచేస్తున్నావన్నమాట. కాని, కమలా! దారం తీయడానికెప్పుడు వెళ్తున్నావు? తీరికే లేదుగా నీకు!

కమల:—పగలు ఒంటిగంటనుండి మూడుగంటలవరకూ వడికి వస్తాను. ఆ తర్వాత యింట్లో పని చేసుకుంటాను. దీనివల్ల నాకు రెండు లాభాలు కలిగాయి. ఒకటి, మిమ్ములను కష్టపెట్టకుండానే మనిద్దరికీ బట్టలు సంపాదించుకోవటం, రెండవది సంసార విషయాలను గురించి విచారపడడానికి నాకు వీలుచిక్కక పోవటం. దారం తీస్తుంటే మనస్సంతా పవిత్రమౌతుందండీ.

రామారావు:—అలాగా కమలా! మనం మన యింటికి ఒక రాట్నం తెచ్చుకుందాము. నాకు దారం తీయటం నేర్పు. మనకు సరిపోయే గుడ్డలకు దారం మనమే తయారు చేసుకోవచ్చు.

కమల:—(ఉత్సాహంతో) అవునండీ. తప్పక మనమూ పనిచేద్దాం.

తెల్లవారింది. ఆ రోజు సంవత్సరాది పండుగ. ఇల్లంతా ఆ చిన్న కుటుంబంతో కళకళ్లాడుతోంది. రామారావు కొత్త బట్టలు కట్టుకొన్నాడు. సంతోషించాడు.

ప్రతి స్త్రీ భర్త కష్టములను తెలిసి కొన్నట్లైతే, మరి, ఆ యింటికంటే వేరొక స్వర్గం వుండదు. సాంసారిక బంధనాల్లోవుండే స్వల్పలోపాలను సర్దుబాటు చేసుకొనే నేర్పు ప్రతి స్త్రీ అలవరుచుకోవాలి. ఆ రోజాయిల్లాలు భర్తా, పిల్లలతో ఆనందంగా కాలం గడిపింది. పండుగ పిండివంటలకంటేగూడా ఆ శుద్ధఖాదీ ధోవతీ చీరే వారికి ఆనందాన్ని యిచ్చినై. ఆ ఆనందాన్ని ప్రసాదించిన మహాత్ముని చిత్రపటానికి వారు తలవంచకుండా ఉండలేక పోయారు.

—:o:—

# "పద్మ" నాటిక విమర్శ

నాటిక రచయిత శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు



ప్రస్తుతపు నవీనప్రపంచమున స్త్రీవిద్య చాలవరకు వ్యాపించుచున్నదనుట హర్షింపదగిన విషయము. కాని స్త్రీవిద్యావ్యాప్తి కలిగినకొలది సాధారణముగ స్త్రీలలో గల మూఢత్వము, ఈర్ష్యాసూయలు, పరనింద, తొలగిపోవుటకు బదులు హెచ్చగుట విచారింపదగిన విషయము. నేటిదినములలో స్త్రీలు చదివి చెడిపోవుచున్నారనియు చదువుకున్న బాలిక నీతిదాయకముగ ప్రవర్తించుటలేదనియు స్త్రీ యున్నతవిద్య నభ్యసించుటవలన, పురుషులలోగూడ అవినీతి హెచ్చగుచున్నదనియు చాలమందినమ్మకము. యిట్టి నమ్మకము రూఢిపరచు నవలలు, నాటకములు, కథలు, గూడ చాలవరకు సృష్టింపబడి ప్రజలలో స్త్రీవిద్యయన గౌరవముతోబాటు హేళనగూడ పెంపొందింపజేయుచున్నవి. యీ గ్రంథకర్త లందరును స్త్రీవిద్య సాధారముగ దీసికొని చదువుకున్న బాలిక యెవనితోనో లేచిపోయినదనియో, చదువుకున్న కోడలు, అత్తను మగనిని ధిక్కరించి సంసారము విడచి పారిపోయెననియో, లేక చదువుకొనుచున్న బాలిక యెచ్చ నీచములెరుగక, సహాధ్యాయునితో జాతిమత వివక్షతలెరుగక వర్తించినదనియో, తమ నవలలకేమి, నాటకముల కేమి కథలకేమి, మూలముగనెంచి రచనలు సాగించుచున్నారు.

యిట్టి సమయములో "పద్మ, లేక, ఆదర్శవిద్యార్థిని" అను యేకాంకనాటిక సృష్టింపబడుట ముదావహము. యీ నాటిక మేనెల రెండవతేదీ బాపట్లయందలి "సరస్వతీ మెమోరియల్ బాలికా హైస్కూలు" వారిచే ప్రదర్శింపబడగా చూచితినని వ్రాయ సంతసించుచున్నాను. దీనిని హైస్కూలు నందలి బాలికలు యుపాధ్యాయినులు కలిసి బహుసమర్థతతో పాత్రపోషణగావించి నాటకమును జయ ప్రదముగ సాగించి ప్రజాహృదయము చూరగొనిరి. మరియు నాటకము జరుగునంతవరకు ప్రజలలో కలకలము లేకుండ సూదిరాలినను వినబడునంత నిశ్శబ్దముగా నున్నదనిన యీనాటకమందలి భావమాధుర్య మెట్టిదో గమనింపదగినది.

పద్మయను నొక స్త్రీవిద్యార్థిని యున్నతవిద్య నభ్యసించుటకై తండ్రి ప్రోత్సాహముచే కాలేజీలో చేరుట, బుద్ధిమతియగు నా బాలికయందుగూడ అల్పహృదయు లసూయాపరులై లేనినిందల నారోపించుట, యిందుల కాబాలిక తండ్రియుత్సాహ వచనములు తోడుగా ధీరచిత్తయై వీటినెదుర్కొనుట, విద్యాసంపద కలిగియుండియు వివేకజ్ఞానములేని ఆకాలేజీ ప్రొఫెసరొకడు పతివ్రతయగు భార్యను విద్యలేని కారణమున విసర్జించి పద్మను భార్యగా బడయ యత్నించుట, యిందుకు పద్మతల్లి యాలోచించినను, పద్మ, ఆమెతండ్రి దీనిని తీవ్రముగ నిరసించుట, మరియు పద్మ సాహసముతో, లోక నిందలకు వెరువక ప్రొఫెసరు భార్యను 6 నెలలలో తన చాకచక్యముచే విద్యాసంపన్ననుగాజేసి ఆ శీలవతి సంసారము చక్కజేయుట, తుదకు పద్మ దేశసేవాదురంధరుడగు నొక సద్గుణసంపన్న యువకుని వివాహమాడి లోకమునకాదర్శ దంపతులై

వెలయుట ననునవి యిందలి యితివృత్తము. ఇట్టి యుత్తమనాటిక రచించిన గ్రంధకర్త్రి భారత స్త్రీలోకమునకు ముఖ్యముగ ఆంధ్రస్త్రీలోకమునకు చిరపరిచితురాలై తమ అశేషేముషీసంపదచే అనేకమాసపత్రికల రచనలచే ముఖ్యముగా గృహలక్ష్మి పత్రికలో శారదలేఖగా ప్రకాశించుచున్న మాతృశ్రీ శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. "జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యమనవసర మ"నునట్లు యీమె కవితా మాధుర్యము, శైలిపోషణాసమర్థత, విద్యావంతులగు సోదర సోదరీమణులెరింగినదే గనుక నేనిక నిచ్చట వాకొనుటనవసరము. యిట్టి విదుషీమణి కిట్టి యున్నతభావముకలిగి ఆదర్శప్రాయమగు నిట్టి నాటిక రచించుట మన యదృష్ట మనవచ్చును. సహృదయుల ప్రోత్సాహబలముచే వరలక్ష్మమ్మగారీ నాటికను అచ్చొత్తించి, ప్రజానీకమున కందుబాటగునట్లుజేసి, యిట్టియుత్తమరచన నాంధ్రలోక మాస్వాదించు నదృష్టము కలుగజేయుదురని యాశించుచున్నాను. పరాత్పరుడీ విదుషీమణి కాయురారోగ్యములనిచ్చి, అన్నిట వెనుకబడియున్న యాంధ్రజాతి మేల్కొనుటకింకను యిట్టి యుత్తమగ్రంధముల రచింప తోడ్పడుగాక!

ఇమ్మానేని చంద్రకాంతామణి

# లోకవార్తలు

సయాందేశం ఫిలిప్పైన్ దీవులకు బియ్యం పంపుతున్నది. సయాందేశం విద్యార్థులు ఫిలిప్పైన్ దేశంలో చదువుకుని ఆదేశపు పిల్లలను పెళ్ళిచేసుకొని వస్తున్నారు. మనదేశంలో నాగవల్లిలో "మాపప్పేనుగు నిస్తాను, మీ ఉప్పేనుగు నిస్తారా?" అని యొకసంభాషణ నడుస్తుంది. ఇప్పుడు సయాంవారు ఫిలిప్పైన్ దీవులకు బియ్యాన్నిచ్చి పిల్లలనుతీసుకొనివెళ్లుతున్నారు. బియ్యంపడంబడిక వ్రాసుకొనుటకై వచ్చిన ఫిలిప్పైన్ నాయకుడు - "ఈ వర్తకము - ఇలాగే సాగిద్దాము" అని సన్మానసభలో చెప్పాడు. దానికి సయాం వాణిజ్యమంత్రి: "నిరభ్యంతరంగా" అన్నాడు.

♦ ♦ ♦

సయాందేశమునుంచి దొంగతనంగా బియ్యము, నల్లమందు పరాయిదేశాలకు తీసుకొనిపోబడుతున్నవట; సయాంలోనికి సిగరెట్లు, గడియారాలు, నగలు - దొంగతనంగా తెస్తున్నారు. కస్టమ్స్ అధికార్లు ప్యాకింగులు విప్పనవసరములేకుండా—యక్స్‌రేసాధనం మూలంగా పెట్టెలలో ఏమున్నది కనుక్కొనగలుగుతున్నారు. ఇందుకుగా చక్కని యక్స్‌రే నిర్మాణమొకటి తయారైనదట.

♦ ♦ ♦

నేడు జర్మనీప్రజలు, పొగాకు, సారాయి, నల్లమందు మున్నగునవి సేవించడమనే వ్యసనలోలురై ఉన్నారట. సుఖరోగాలవల్లకూడా విశేషము పీడితులట.

♦ ♦ ♦

చెట్లు పూలు, కాయలతో వృద్ధిపొందాలంటే సూర్యరశ్మి చాలాఅవసరం. కాలిఫోర్నియాలో కృత్రిమమైన సూర్యరశ్మి ప్రసరింపజేసి - మంచి నారింజజాతులు హెచ్చుగా పండ్లుపండే ఏర్పాటు చేస్తున్నారట. ఎకరానికి 40 లైట్లు, ఒక్కొక్కలైటు 5 చెట్లకు రశ్మి వెదజల్లుతుంది. దీనివల్ల పండ్లు హెచ్చుగా దిగడమేగాక అవి తియ్యగాకూడా ఉంటున్నవట.

♦ ♦ ♦

డబ్లిన్ సమీపమున యొకమండలములో కిసాన్ యువకులు, బ్రహ్మచారులు, "బ్రహ్మచారులక్లబ్" ను ఏర్పరచినారు. వీరు కాగల వివాహములలో వరకట్నంరేట్లు నిర్ణయించినారట. 8—11 ఎకరములు వ్యవసాయంచేసే కిసాన్‌కివ్వవలసిన వరకట్నం 400 డాలర్లకు తక్కువ ఉండరాదు. 12 మొదలు 24 ఎకరములలోపు ఆస్తిగలవానికి 600 డాలర్లు మొదలు 900 డాలర్లవరకు కట్నమివ్వవలయునట.

♦ ♦ ♦

అమెరికాలో స్త్రీల "ఫాషన్లు" చాలా ముదిరిపోతున్నవట. ఒక పట్నంలో - దీన్ని చూచి చూచి, ప్రాణం విసికి, 73 గురు భర్తలు తమభార్యలకు నోటీసిచ్చినారట. వారు పూర్వసాంప్రదాయాలను

తిరిగి అవలంబించి సాజూసుగా ఉండకపోతే, తాము గడ్డాలు పెంచేస్తాము - అని వారి నోటీసులో బెదిరిస్తున్నారా భర్తలు.

♦ ♦ ♦

జనపనార చెట్టుకు బదులుగా మరోనార చెట్టుకని పెట్టినారు. సోదేపూర్ ఖాదీ ప్రతిష్ఠాపనంవారు. ఈ చెట్లు 8 అడుగులదాకా పెరుగుతవట. రెండు చెట్లనుండి నారతీస్తే 8 ఔన్సులు వచ్చినదట. దీని పేరు "చుక్రై". వివిధనామములతో ఇది బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో పైరగుచున్నది.

♦ ♦ ♦

నేపిల్స్‌లో లూషియానిల్లో అనుయతనిభార్య 1938 సం॥ కడుపులోబాధవల్ల ఆపరేషన్ చేయించుకొనినది. డాక్టరుగారి అజాగ్రతవల్ల శాస్త్రవణమొకటి ఆమెకడుపులోనే నిలిచిపోయినది. ఆ శాస్త్రవణం కడుపులోయున్నసంగతి తెలియక కడుపులో బాధగాయున్నదని ఆమె ఈసంవత్సరము అను పత్రికపోగా, డాక్టరు ఆమెకడుపులోనుండి శాస్త్రవణమును తీసివేసెను. అప్పుడు బాధతొలగినది.

♦ ♦ ♦

అమెరికావాని అంబాస్సిడిల్ అనునతనిభార్య ఇటీవల ప్రపంచయాత్రచేసివచ్చినది. ఆమె నేషనల్ కౌన్సిలుకు ప్రెసిడెండు. ఆమె చూచిన స్త్రీలందరికంటె మనహిందూదేశపుస్త్రీలు మంచి శక్తి సామర్థ్యములు కలవారని చెప్పినది. జపానుస్త్రీలుగూడ యుద్ధరంగంలో దుముకగలవారని చెప్పినది.

♦ ♦ ♦

బ్రిస్టల్‌నగరంలో 28 సం॥ల వయస్సుగల మిసెస్ మార్గరెట్ యలిజబెత్ అనేఆమె నలుగురు కవలపిల్లలను కనినది. జూలైలో ప్రసవించవలసినది జూన్‌లోనే ప్రసవించినది. పిల్లలంతా ఆరోగ్యముగానేఉన్నారు. నాల్గవబిడ్డయే కొంత సున్నితంగాఉన్నది. అయినా డాక్టరు బ్రతికించితీరాలనిఉన్నాడు.

♦ ♦ ♦ ♦

చుంకింగ్‌లో ఒక 20 వత్సరముల యువతియున్నది. ఆవిడపేరు యాంగ్ మీ. ఆమె 9 సం॥ల నుండి ఆహారముతీసికొనలేదట. దానివల్ల ఆమెకేమియు జబ్బుచేయలేదని చెప్పుచున్నది. ఈ విషయము తెలిసికొనుటకు అమెరికన్ డాక్టర్లు చుంకింగ్ పోయియున్నారు.

---



---

# సంపాదకీయములు

## గోధుమ రేషన్

మద్రాసు ప్రభుత్వమువారు ఆ మధ్య నిల్పివేసిన గోధుమ రేషన్ ముందు మద్రాసు నగరమందైన ప్రారంభించుచుండుట సంతోషింపదగిన విషయం. ఇటీవలనే గోధుమ నివ్వనారంభించిరిగాని ఆ 8 ఔన్సుల బియ్యములోనే మినహాయించి ఇచ్చుచుండిరి. ఇప్పుడట్లుగాక 8 ఔన్సులకుతోడు 2 ఔన్సులు ఇవ్వ నిర్ణయించిరి. ఆ 8 ఔన్సుల బియ్యములోను కోరుచో మినహాయించి గోధుమ నిచ్చుటకుకూడ నిర్ణయించిరి. గోధుమ ఆహారధాన్యముగా ఎంత ప్రశస్తమైనది. పాకకళ యందిచ్చియున్నాము. కావున గోధుమ సేవగించుకొనక తక్కువ ప్రాణశక్తులు మాత్రమున్న బియ్యముతోపాటు కలిపి తిన్నట్లైతే పిల్లలు, పెద్దలు, ఆరోగ్యవంతులు, బలవంతులు నగుదురు. ఆరోగ్యమే భాగ్యము. త్వరలో ఇతరప్రదేశములందును గోధుమ నిట్లే ఇచ్చుట ఏర్పాటు చేతురని ఆశించుచున్నాము.

## కీ॥ శే॥ కొచ్చిన్ మహారాజావారు

శ్రీ కొచ్చిన్ మహారాజావారు ఈ నెల 8 వ తేదిన కీర్తిశేషులైరని తెలియుటకు చింతించుచు సంస్థాన ప్రజలందరికి మా సానుభూతి తెలుపుచున్నాము. వీరికి చనిపోవునప్పటికి 78 సం॥లు. వీరు చాలా న్యాయపరులు; ప్రజాహితకరులు, ప్రజాస్వాతంత్ర్యమును మన్నించిన సంస్థానాధీశులు. ఐక్యకేరళము నంగీకరించిన ప్రముఖులు; హరిజనోద్ధారకులు, పండితులు. వీరి స్థానే మహారాజపదవి నందబోవువారు శ్రీ రామవర్మగారును మద్రాసు విశ్వవిద్యాలయపు పట్టభద్రులు; సంస్కృత పండితులు; లలిత కళల యందు నేర్పరులు. వేదాంత శాస్త్రనిధులు. అచటి ఆచారానుసారము, వీరు స్వర్గస్థులగు మహారాజా కేరళవర్మగారి సోదరీ కుమారులగుటచే నీ పదవినందగల్గుచున్నారు. వీరి వయస్సు 72. వీరచిరకాలములో సింహాసనాధిష్ఠితులై ప్రజాహిత పరిపాలనవలన స్వర్గస్థులైన కేరళవర్మగారి మృతివల్ల కొచ్చిన్ ప్రజలకుకల్గిన దుఃఖమును మరపింతురుగాక. శ్రీ కేరళవర్మగారి ఆత్మ శ్రీరామసాయుజ్య మందుగాక.

## బస్సు ప్రయాణీకుల ఇబ్బందులు

బస్సు ప్రయాణీకులకు, అందు ముఖ్యముగా స్త్రీలకు చెన్ననగరంలో గల ఇబ్బందులగూర్చి ఇది వరలో వ్రాసియుంటిమి. నేడు ఈ శాఖా పరిపాలనముగైకొన్న మంత్రి శ్రీ గోపాల రెడ్డిగారు స్వయముగా బస్సు స్టాండులకు వెళ్లి ప్రయాణీకుల ఇబ్బందులను గ్రహించుట ప్రశంసింపదగినది. ప్యారిస్ కార్నర్ వద్ద జనము వత్తిడిచూచి 'క్యూ' పద్ధతిని ప్రవేశ పెట్టదలంచినట్లు ప్రకటింపబడినది. ఈ క్యూ పద్ధతిని సెంట్రల్ స్టేషన్, మౌంట్ రోడ్డు మున్నగు పలుప్రదేశములకూడ ప్రవేశపెట్టవలసియున్నది. దానివల్ల స్త్రీలు మిగత వారిచే మోచేతిపోట్లు తినుచు బస్సు నెక్కవలసిన అగత్యములేకుండ సకాలమున ప్రయాణము చేయ వీలగును. బస్సు కండక్టర్లుగా స్త్రీల నేర్పాటుచేయ దలంచుటయు సంతోషింపవలసినదేగాని ప్రయాణీకులందరును వారిని గౌరవముగా చూతురా యన్నది ఆలోచింపదగిన సంగతి.

## పుణ్య కార్యము

శ్రీమతి అంబుజమ్మాళ్ గారి యాజమాన్యమున మద్రాసు వుమెన్స్ ఇండియన్ అసోసియేషన్ వారు ప్రతి నెల రు 100/-వరకు ఖర్చుపెట్టి "శ్రీనివాస గాంధీనిలయము"నందు పేదవారిబిడ్డలకు పాలు,

గోధుమ గంజి పోయుట పుణ్యకార్యము. ఇందు రు 70/-ల దాకా చందాలట. ఇట్టి కార్యము లొనర్చు వారు చందాలకు తిరుగనవసరము లేకుండ శాశ్వత నిధు లేర్పడుట శ్రేయస్కరము. రాతి దేవుళ్లకు చేయి చూపి పులిహోర, దధ్యోజనములతో స్వాముల పొట్టలు నింపుకొనే దేవాలయాలలో వానిని తగ్గించి ఇట్టి పుణ్యకార్యములను ధర్మకర్తలు ప్రవేశపెట్టినచో మంచిది.

## వి వా హ ము లు

మనపూర్వులు అష్టవిధవివాహములు చెప్పిరి. పాశ్చాత్యులలో గాంధర్వములే నేడు హెచ్చుప్రయుక్తమై యున్నవి. అయితే కొంతకాలమువరకు తల్లిదండ్రుల సలహా సంప్రతింపులుండేవి. నాగరికత పెరుగుకొలది పరిస్థితులుమారినవి. స్వేచ్ఛాస్వాతంత్ర్యములు తుదకు 'కొన్నాళ్లదాంపత్యము' వరకువచ్చినవి. స్వేచ్ఛ పెరుగుకొలది అచ్చట దంపతుల అన్యోన్యతయు మందగించినది. నేడింగ్లాండులో సంవత్సరానికి 50,000 విడాకులు జరుగుచున్నవి. సాంఘికవ్యవస్థనుగూర్చి చింతించే పెద్దలకు దీని నరికట్టుఉపాయము యేమాఅని ఆలోచనఏర్పడ్డది. ఏమీలేదు, అద్దె ఇల్లుమారితేనే అన్నీకొత్తే? కాపురమేమారితే? అందుచేత-ఇంగ్లాండులో ప్రభుత్వమువారే డెన్నింగ్ కమిటీ అని-ఒక విచారణసంఘం వేశారు. వారు ఒకరిపోర్టు తయారుచేసి ఇచ్చారు. ఈ రిపోర్టుప్రకారం ప్రభుత్వాదరణగల ఒకపెద్దసంఘము నేర్పరచారు. వారి వ్యవహారంసాగను ప్రభుత్వం ధనమిస్తుందట. భార్యాభర్తలకు పొరపులు పొడమరించగానే-ఈసంఘంపెద్దలను ఆశ్రయిస్తే-ఉభయులసంగతి తెలుసుకొని వారివారికి తగినసలహాలిచ్చి సర్దుబాటుచేస్తారు. తగాదాముదిరి కోర్టుకెక్క లోపలనే భార్యాభర్తలు మెళుకువతో సఖ్యపడవచ్చును. "ఈ పద్ధతిని మేము 10 సం॥ల కిందటనే సూచించాము" అని దాంపత్యధర్మవేత్త ఒకాయన అంటున్నాడు. ఇంతకూ మనపూర్వులు-చెప్పిన "ఫలానావారి కుమార్తెను ఫలానావారి కుమారునికిచ్చి వివాహమొనర్చుటకు పెద్దలు సుముహూర్తము నిశ్చయించినారు" అన్న ఫక్కీకే వస్తున్నారు. వధూవరులు ఒండొరులను తెలుసుకొని వరించుకోవలసినదే. అంతఃపురంలో ముద్దరాలికి, కత్తికి వివాహాలుచేయడం మేముఅంగీకరించము. అయితే యవ్వనులైన యువతీయువకులు పెద్దల సలహా సంప్రతింపులుచేయడం శ్రేయస్కరము. వివాహం వ్యక్తిగతమేకాదు, సాంఘికంకూడా. క్రమంగా పైసంఘం వివాహాలుకాకముందుకూడా సలహాలివ్వడానికి పూనుకుంటుందనవచ్చు. మనదేశంలోను ఇట్టి దవసరమవుతున్నదని, నిన్నమొన్న ఢిల్లీలో శాకుంతలయుదంతం చెప్పుచున్నది. మన ప్రభుత్వాలుకూడా యోచించాలి.

## కీ॥ శే॥ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు.

ఆధునికులైన యువకులకు పరిచయముకలవారు కాకపోయినా అనేకవిషయముల చాలా గొప్పవారు శ్రీ ప్రకాశరావుగారు. వాటన్నిటిలో ముఖ్యమైనది వారి సంఘసంస్కరణము. శ్రీ వీరేశలింగంగారి ప్రథమ శిష్యగణములో వీరొక్కరు. ముఖ్యముగా వీరు స్త్రీవిద్యకై హెచ్చుగా ప్రచారము చేసినవారు. నేడు సర్వసామాన్యముగ జరుగుచున్న వెన్నియో గొప్ప సంస్కరణ సమస్యలై ప్రజల వ్యతిరేకము నెదుర్కొనవలసియుండిన రోజులలో వాని నవలంబించి ప్రచారమొనర్చిన ఈ వృద్ధునిమృతికి మా సానుభూతి తెల్పుచున్నాము.

## సంతాన నిరోధము కూడదు

సంతాన నిరోధము కూడదు అని మేము పలుమారు వ్రాసియున్నాము. ఫ్రాన్సుదేశమును గూర్చిన యొకవార్తయు మా వాదమును బలపరచుచున్నది. నేడు లెక్కచూడగా అచట జనాభాలో 21 సం॥లకు పైబడిన వయస్సు వారిలో 100 కి 29 మంది 50 సం॥లకు మించిన పెద్దలట. ఇదే పద్ధతిని నడిచినచో 1965 నాటికి వీరు 34 గురు అగుదురనియు, ఈ శతాబ్దాంతమునకు 40 మంది అగుదురనియు ప్రవీణులు చెప్పుచున్నారు. దీనివల్ల ఆ దేశములో ఉత్పత్తి శక్తి ఎంత ఉడిగిపోవుచున్నదో అనే ఆత్రము వారికి కలుగుచున్నది. ఈ రోజులలో వస్తువుల ఉత్పత్తి విస్తరించని ఏ దేశమునకు క్షేమములేదు. కావున- గృహలక్ష్ములు ఆరోగ్యవంతులు, జ్ఞానవంతులు, పనిమంతులునై, - ఆరోగ్యవంతులు, జ్ఞానవంతులు, పనిమంతులునైన సంతానమునుగని జనాభా వృద్ధిపరచుట దేశక్షేమముగాని, ఉడికీ ఉడకని ఆర్థిక సాంఘిక సిద్ధాంతములను పురస్కరించుకొని "సంతాన నిరోధ"మని గంతులు వైచుట, నిరర్థకకము, హానికరము.




## గాంధీమహాత్ముని దశావతారములు.

గాంధీమహాత్ముని దశావతారములు అనునీవచనగ్రంథము శ్రీ మధురకవి నాళం కృష్ణారావుగారు వ్రాసినది. ఆంధ్రులు మధురకవి కలమునుండి సామాన్యముగా తియ్యని పద్యములను కోరుదురు. అయితే ఇది వచనకవనము. భాగవతాంతర్గతమగు విష్ణుమూర్తి దశావతారములతత్వము ననుసరించి గాంధీమహాత్ముని చరిత్రను తత్వతః దశావతారములుగా నీమధురకవి రచించి యున్నారు. స్పష్టముగ, సరళముగ, క్లుప్తముగ మహాత్ముడుబోధించిన, అహింసా సత్యములు ఈ డొంకతిరుగుడు వివరణ లేకయే తెలియుచున్నవి. అయితే ఆచరణలోనే చిక్కువచ్చుచున్నది. అట్లని శ్రీ కృష్ణారావుగారికృషిని, కృతిని కించపరచుటలేదు. తెలుగులోను, భాగవతపు రాణమునందును సామాన్యజ్ఞానముగల వారికెల్ల సులభగ్రాహ్యములగునట్లు ఈ చిన్నగ్రంథము వ్రాయబడినది. దీనిని కృష్ణారావుగారు 1920లో ఉప్పుసత్యాగ్రహము రోజులలోరచించిరట. మధురకవికి, గాంధీతత్వము కేవలము కలముచివరదిగాదు. 1930 జనవరి 21వ తేదిన పెద్దాపురం తోటవిందు భీభత్సరంగంలో వారునున్నారు. తలపై గాయమై మోమున నిల్వగా రక్తము కారుచుండిన వారి ముఖబింబ మీ విమర్శకునికింకను జ్ఞప్తియే. దీనివెల రు 0-12-0లు. వలయువారు రౌతు బుక్కుడిపో, రాజమహేంద్రవరము అనివ్రాయుడు.

## మురళి

క్రొత్త తెలుగు వారపత్రిక. "ఆంధ్రా హెరాల్డు" పత్రికాసంపాదకులు శ్రీ వైద్యులరమణారావుగారే దీనికిజనకులు. అయితే వ్రాతకు, సంపాదకులు మామిత్రులు శ్రీ ద్రోణంరాజు చిన్నకామేశ్వరరావుగారు. రమణారావుగారు అన్నట్లు చిన్నకామేశ్వరరావుగారు చెన్నపురి ఆంధ్రమహాసభలో పేరుపొందిన బిలియర్డ్సు క్రీడానిపుణులున్నూ, ప్రఖ్యాతివహించిన సినీమాడైరక్టరులునేగాక-చిరకాలంక్రిందటనే పేరుమోసిన పత్రికారచయితలు. (1921 - 31) ఒక్కదశ ఉజ్వలంగావెలిగి, కొండెక్కిన "కాంగ్రెస్" అనే తెలుగువారపత్రికాజ్యోతికి ప్రప్రథమంలో స్నేహముంచి వత్తివెలిగించిన శేఖరి. ఆపత్రికాసందర్భంలో మే మిద్దరం రేచుక్క - పగటిచుక్క. "ద్రో. చి. కా" వ్రాసిన "భారతస్వాతంత్ర్యవార్త"లనే వ్యాసాలకు మా మిత్రులు శ్రీ కాంద్రేగుల రామచంద్రరావుగారు, సంపాదకులుగా 2 సంIIలు కాబోలు ఖైదుచేసివచ్చారు; నాసంగతి చెప్పనేల ? మేమిద్దరం ఆ పత్రిక ఆద్యంతాలు చూచినవారము. అలాంటి చినకామేశ్వరరావుగారిచేతిలో నిల్చి మురళి మ్రోగనున్నది. ప్రథమసంచికలో కొన్నిఅపశృతులు లేకపోలేదు. అయితే, ఇప్పుడే చేతబట్టి అలవరచుకుంటున్నారు గదా. 'మురళీ' సేవ అంటే సామాన్యము

కాదు. ఊపిరిపోయాలి. అందుకు శ్రీ చినకామేశ్వరరావుగారు అన్నిటా సమర్థులు. శ్రీ రమణారావుగారి కలంపోట్లు మిక్కిలిగా తిన్న మంత్రి కళా వేంకట్రావుగారు ఈ పత్రికా ప్రారంభోత్సవం చేశారంటే- అనిరుద్ధవివాహం జ్ఞాపకానికివచ్చింది - మురళి చిరకాలం వర్ధిల్లుగాక. సం॥చందా ఎక్కడాలేదు; విడిపత్రిక రు 0-2-0 లుమాత్రం. పత్రికా కార్యాలయం. 4. స్ట్రింగర్ స్ట్రీట్, జి టి. మద్రాసు.

వెం.

## సారథి

హైదరాబాద్ స్టేటు కాంగ్రెసుతరపున కొత్తగా ప్రారంభమైన వారపత్రిక - హైదరాబాదు గడబిడలు ప్రచురించుచు విమర్శించుటకు ఎన్నిపత్రికలైనా చాలవు అనిపించుచున్నది. దీనిసంపాదకులు శ్రీ తాళ్లూరి రామానుజస్వామిగారు. బెజవాడనుండి వెలువడుచున్నది. దీనికి సుప్రసిద్ద దేశభక్తులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రారంభోత్సవము గావించి - తమ అమూల్య సందేశమునిచ్చినారు. ప్రథమపత్రికలో కడపటిపుటయందు మునగాలస్టేటు కాంగ్రెసువాలంటీరు శిబిరముపైబడి కమ్యూనిస్టులు వేసిన బాంబుఫలితమని కొందరిక్షతగాత్రుల బొమ్మలు ప్రచురమైనవి. వీరు సన్నిహితులైయున్నందున హైదరాబాదురాజ్యంలోని దారుణచర్యలను విస్తారంగా తెలిసివిమర్శించగలరు. విడిపత్రిక 0-2-0. చందాదార్లు కాగోరువారు వీరికార్యాలయానికి గవర్నరుపేట, బెజవాడ, అనివ్రాయండి.

## తెలుగుదేశం

బెజవాడనుంచి బయలుదేరిన మరొక తెలుగువారపత్రిక. తెలంగాణా, రాయలసీమ, సర్కారాంధ్రులు ముగ్గురు ఐకమత్యమై, విశాలాంధ్రరాష్ట్రము స్థాపించుకొని అభివృద్ధిచెందుడని ప్రబోధించుట ఈ పత్రికఆదర్శం. జాతీయ, అంతర్జాతీయ విషయములనుకూడ విస్మరించక వెల్లడించి, విమర్శిస్తున్నది. ముఖ్యంగా నైజాముగడబిడల గుట్టుమట్లుబట్టబయలు చేస్తున్నది. విశేషము ఏమిటంటే ఈపత్రిక సంపాదకత్వము శ్రీ సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవిగారి హస్తగతమైయున్నది. "గృహలక్ష్మి" నీ ఆతెలుగుసోదరి సంపాదకత్వమున వెలువడుచున్న "తెలుగుదేశం" పత్రిక చిరకాలము నడుచుగాక అని ఆశీర్వదిస్తున్నది. చందాసాలీనా రు 10-0-0 లు. వలయువారు పత్రికా కార్యాలయానికి విజయవాడ, గాంధీనగరం అని వ్రాయండి.

## శ్రీ సర్వధారినామ సం॥ర ఆషాఢ, శ్రావణ మాసములు.

| | | | |
|---|---|---|---|
| | | | [శయనైకాదశీ. |
| | 16 | శు | ఏ. 57-6 వి 14-39 ది 24-50 పున్న దక్షిణాయన పర్వపుణ్యకాలం స్మార్తానాం |
| | 17 | శ | ద్వా. 56-6 అ 14-52 వైష్ణవానామేకాదశీ. శ్రీసురేశ్వరాచార్య |
| | 18 | ఆ | త్ర. 56-41 జ్యే 16-10 బ్ర 21-7. [భగవత్పాదారాధనం. |
| | 19 | సో | చతు. 58-28 మూ 18-40 పున్న. |
| | 20 | మం | పూ. ○ 60-0 పూషా 22-26 భ 30-0 వ్యాసపూర్ణిమా. ఆదవాని కాణ్వవామన |
| | 21 | బు | పూ. ○ 1-32 ఉషా 27-12 రా 6-1 [తీర్థ పుణ్యదినం. |
| | 22 | గు | బ॥ పాడ్యమి 5-15 శ్ర 33-7 రా 11-40 చాతుర్మాస్య ద్వితీయా |
| జూలై | 23 | శు | వి. 9-59 ధ 39-27 గడేకల్లు భీమలింగరథోత్సవం. |
| | 24 | శ | త. 14-58 శత 46-5 సంకష్టహరణ గణేశవ్రతం. |
| | 25 | ఆ | చ. 19-4 పూభా 52-25 పంచమీతిథిః. |
| | 26 | సో | పం. 24-20 ఉ-భా 58 7 శూన్యతిథిః శ్రీజయతీర్థ టీకాచార్యపుణ్యదినం. |
| | 27 | మం | ష. 28-1 రే 60-0 ది 30-20 షష్ఠీతిథిః. |
| | 28 | బు | స. 30-27 రే 2-40 రా 23-30 |
| | 29 | గు | అ. 32-4 అశ్వ 6-20 ది 31-16 రుద్రసావర్ణికమన్వాదిః. |
| 1948 సం॥ | 30 | శు | న. 32-19 భ 8-40 ఇంద్రాణీకుమారీపూజా. |
| | 31 | శ | ద. 31-10 కృ 10-0 రా 17-43 |
| | 1 | ఆ | ఏ. 28-53 రో 9-47 సర్వేషాం కామికైకాదశీ |
| | 2 | సో | ద్వా. 25-31 మృ 8-47 దివ 29-3. |
| | 3 | మం | త్ర. 21-12 ఆ 6-41 తిథిద్వయం. మాసశివరాత్రి |
| | 4 | బు | చతు. 16.5 పున్న 3-47 అమాతిథిః అమాతర్పణం. |
| | 5 | గు | అమా ● 10-31 పుష్య 0-17 ఆ 56-4 జ్యోతిర్భీమేశ్వర దివాగౌరీవ్రతం |
| | | | **శ్రావణ మాసం.** |
| | 6 | శు | శుద్ధపాడ్యమి. 1-12 విదియ 53-59 మ 35-59 ది 24-3 చాతుర్మాస్య ద్వితీయా. |
| ఆగష్టు | | | [రాజ్యలక్ష్మీవ్రతం శ్రావణమాస శివపూజాప్రారంభం. |
| | 7 | శ | త. 52-31 పూ ఫ 47-59 ది 10-6 శ్రావణశనివార వేంకటేశ్వర వ్రతం. |
| | 8 | ఆ | చ. 46-8 ఉ ఫ 44-0 ది 4-50 నాగచతుర్థి దూర్వాగణపతివ్రతం. [కరంబలీవ్రతం |
| | 9 | సో | పం. 40-49 హ 40-13 ది 3-23 రా 27-28 గరుడపంచమి నాగపంచమి |
| | 10 | మం | ష. 35 57 చి 37-28 శే. త్యా 3-10 రా 19-8 మంగళగౌరీవ్రతం; సూర్యషష్ఠి. |
| | 11 | బు | స. 31-47 స్వా 35-16 రా 17-11 సత్యవరతీర్థ పుణ్యదినం. |
| | 12 | గు | అ. 28-37 వి 34-0 రా 12-1 కౌమారీదేవిపూజ. |
| | 13 | శు | న. 26-30 అనూ 33-42 రా 16-30 శ్రీమహావరలక్ష్మీవ్రతం. |
| | 14 | శ | ద. 25-3 జ్యే 34-50 శ్రావణ శనివ్రతారంభం. దధి వ్రతారంభం. |
| | 15 | ఆ | ఏ. 25-52 మూ 37-9 సర్వేషాంపుత్రదైకాదశీ, శాకవ్రతారంభం. |

Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.